# సమాలోచన



జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

ద్వితీయ (ప్రత్యేక) వార్షిక సంచిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 3 — 1-11-1979 — సంచిక 1


—* ఈ సంచికలో *—


1) సాహిత్య ప్రక్రియగా కథానిక.
2) శ్రీమద్రామాయణము - కల్పవృక్షము.
3) నాదయోగి (పద్య)
4) వటవృక్షవర్ణన - ధూర్జటి, కృష్ణదేవరాయలు.
5) ఆశాలోచనాలు (పద్య)
6) 'రాయప్రోలు సుబ్బారావు- గుడిపాటి వెంకటచలం.'
7) ఆరుద్ర చిత్రించిన మధ్యతరగతి జీవితం.
8) కలియుగ భీముడు - కోడి రామ్మూర్తినాయుడు.
9. నిత్యవ్యవహారంలో కొన్ని వింతప్రయోగాలు.
10) లీలాగోపాలము. (పద్య)
11) భారతీయులు - దాంపత్య ధర్మపరిణామము.
12) కవిరాక్షసీయం.
13) నేనుకాక మరో నలుగురు.
14) బాపిరాజుగారి అసంపూర్ణనవల 'మధురవాణి.'
15) జాషువా కవిత్వంలో ప్రకృతితత్త్వం.
16) కాలం సత్యం. (పద్య)
17) సరస కవిత్వ కాంతా! (పద్య)
18) కీ. శే. కళాప్రపూర్ణ డా. చిలుకూరి నారాయణ రావుగారి ఆంధ్రభాషాసేవ.
19) శ్రీమద్రామాయణ కల్పవృక్షం.
20) 'స్వయంవరం' కావ్యం - జాషువా కథాకథనం.
21) మరియొక నిరోష్ఠ్య రామాయణము - 'సీతారాఘవ చరిత్రము.'
22) అశ్రుతర్పణము. (పద్య)
23) కులపాలికా ప్రణయకవితా రసధుని - శ్రీనాయని.
24) గ్రంథసమాలోచన - ఎ) కాశీవిశ్వేశ్వర శతకము బి) రామప్రభుశతకము సి) మృత్యుంజయ శతకము.
25) కనుపించని తెలుగుదనము. (పద్య)
26) చెట్టు. (పద్య)
27) భావవిహారీ! (పద్య)
28) సమాలోచన ద్వితీయ సంపుట రచనల పట్టిక.
29) స్వవిషయం.



—* 1, 16 తేదీలలో ప్రచురింపబడును *—

చందా

సంవత్సరమునకు రు 10-00.

అర్ధసంవత్సరమునకు రు 5-50.

విడిప్రతి 50 పై.

వార్షిక సంచిక రు. 1-00

# ★ సమాలోచన ★

* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *

సంపాదకుడు : విద్వాన్ శ్రీ బులుసు సీతారామశాస్త్రి

సంపుటము 3 రాజమహేంద్రవరము 1-11-1979 సంచిక 1




 వార్షిక సంచిక 

# సాహిత్య ప్రక్రియగా కథానిక

— శ్రీ పి. శ్రీనివాసులు, ఎం. ఏ.

వచన సాహిత్యలోకంలో నవల తరువాత పుట్టిన కథావిశేషం కథానిక. దీని ఆవిర్భావం జరిగి కొద్దికాలమే అయినా నవలతో సమానమైన ప్రాధాన్యాన్ని పొందింది. పాఠక లోకంలో కథానికా పాఠకులసంఖ్య మరి ఏకావ్యజాతికీ లేదనవచ్చు. వాస్తవానికి అద్దంపడుతున్న ప్రతిష్ఠ ఆధునిక సాహిత్యానికంతకీ సామాన్యంగా వర్తించినా, సమాజస్వరూప చిత్రణకొక సమగ్రత చేకూర్చిన ప్రతిష్ఠ సహజంగా రెండే రెండు ప్రక్రియలకు దక్కుతుంది. వాటిల్లో ఒకటి నవల, రెండోది కథానిక. కూలివాడు మొదలు ప్రభుత్వంలో ఉన్న అధికారివరకు తీరిక సమయాలలో తేలిగ్గా చదువుకొనుటకు ఈ కావ్యవిశేషం పనికివస్తుంది. నిలకడా, నిదానం, లేని ఆధునిక మానవ జీవితానికి శ్రమాపనోదనార్థం, మానసిక విశ్రాంతికి ఈ కథానిక ఉపయోగపడుతూంది. ఇది ఉబుసుపోకకు చదువుకొనే ప్రక్రియ కాదు. అల్పజ్ఞులకేకాక అనల్పజ్ఞులకు కూడా వినోదాన్నీ, అహ్లాదాన్నీ అంతకన్నా గొప్పమనోవిశ్లేషణాన్నీ కల్గించే రచన.

సంస్కృత వాఙ్మయంలో కథానిక ఉచ్ఛస్థితి యందుండేది. కాని నేడు సంస్కృతంలో ఇదిలభించటంలేదు. అయితే సంస్కృతసాహిత్యం నేటి తెలుగు కథానిక పుట్టుకకు కారణంకాదు. అందరిలాగే తెలుగువాళ్లలోకూడా కథలు చెప్పుకొనే ఆచారం అనాదిగావుంది. ఆసంప్రదాయానికి ఆధునిక పాశ్చాత్య సాహిత్యపరిచయం తోడై ఒక సాహిత్య ప్రక్రియగా రూపందిద్దుకుంది. అదే కథానిక.

కథకు కథానికకు స్వల్పభేదంఉన్నా వీటిని విడమర్చి చెప్పుకొనడం మనకు అలవాటులేక అన్నిటినీ కథలనే అంటున్నాము. కానీకథ వజ్రమయితే కథానిక సానబెట్టిన వజ్రం. ప్రతి కథానికా కథ కావచ్చుకాని, ప్రతికథా కథానిక కాదు. ఆధునిక సాహిత్యానికి సంబంధించినంతవరకు కథలంటే కథానికలనే ఉద్దేశం ఏర్పడింది. ఆంగ్లంలోని sketch tale, narrative parable, short story అనే అన్నింటిని కలిపి నేడు మనం స్థూలంగా కథానిక అంటున్నాము. ఈ వ్యాసంలో కథానిక, కథ సమానార్థకాలుగానే వాడబడ్డాయి.

తెలుగు సాహిత్యవనంలో కథానికా ప్రక్రియకు నారుపోసిన తోటమాలి గురజాడ అప్పారావు. దాని పేరు "దిద్దుబాటు." అది మొలకెత్తినది 1910 లో. వస్తువులో, భాషలో, శిల్పంలో ఆనాటికి ఆధునికంగా తెలుగుకథను తీర్చిన కళాకారుడు గురజాడ. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, చింతా దీక్షితులు మొదలైనవారు గురజాడ పోసిననారును పెంచి సుక్షేత్రంలో నాటితే, తల్లావఝ్ఝుల శివశంకరశాస్త్రి, వేలూరి శివరామశాస్త్రి, నోరినరసింహశాస్త్రి, కొడవటిగంటి వెంకటసుబ్బయ్య, మునిమాణిక్యం నరసింహారావు, మొక్కపాటి నరసింహశాస్త్రి, గుడిపాటి వెంకటచలం, అడవి బాపిరాజు, వంటి ఔత్సాహికులు కథానికా వృక్షాన్ని పెంచి పెద్దచేసారు. పాలగుమ్మి పద్మరాజు, గోపీచంద్, బుచ్చిబాబుల నుండి నేటివరకు గల రచయితల పోషణలో కథానిక పుష్పించి, ఫలిస్తున్నది.

తెలుగు కథానికా పరిణామ వికాసాన్ని పరిశీలించడానికి, వస్తువు, శిల్పం, భాష అనే మూడుకోణాలనుంచి చూడవలసి ఉంటుంది.

మొట్టమొదట కథానికకు కావలసింది వస్తువు. రచయిత శిల్పి. అయితే వస్తువు బండరాయి. లోకంలో బండరాళ్లకు కొరతలేనట్లే వస్తువులకుకూడ కొరతలేదు. మానవజీవితంనిండా [illegible]. అయితే వస్తువున్నంత మాత్రంచేత అది కథ కాలేదు. రాతిని చెక్కితేనే కదా శిల్పమయ్యేది. ఒకరాయి అద్భుతమైన కళాఖండమూ కావచ్చు. ఆ దేవుంటిముందు మెట్టురాయి కానూవచ్చు. అదంతా శిల్పి పనితనంమీద ఆధారపడి వుంటుంది. అందుకే కథకు మూలమైనది వస్తువైనా, దాన్ని కథగా మార్చే పనితనమే ముఖ్యమైంది. అయితే కొన్ని సమయాల్లో శిల్పి ఎంతటినిపుణుడైనా తానుశిల్పానికి ఎంచుకున్న శిల మంచిది కానప్పుడు అది ఉలి దెబ్బకు చెదరిపోవచ్చు. అట్లే కథావస్తువు బలహీనమైనది అయినప్పుడు కథకుడుఎంత నేర్పరి అయినా, కథ పేలవంగా తయారవుతుంది. కథ పెద్దదిగా ఉండకూడదు. దీని ద్వారా ఒక సందేశం అందాలి. అందువల్లనే తెలుగు రచయితలు వివిధకథావస్తువుల్ని గ్రహించి రసవత్తరమైన కథల్ని తీర్చిదిద్దారు.

గురజాడవారి కథానికల వస్తువు సమకాలీన సమాజస్థితినుండి పుట్టింది. శ్రీపాద వారు తొలినాళ్లలో వీరేశలింగంగారి మహోద్యమ ప్రభావంతో వితంతు జీవిత సమస్యల్ని వస్తువులుగా స్వీకరించినా, తరువాత అన్ని సమస్యల్ని వస్తువులుగా తీసుకున్నారు. సమాజంలో స్త్రీపురుషుల వ్యక్తిత్వ వికాసానికి అవరోధాలైన అలవాట్లని, నమ్మకాల్ని, ఆచార వ్యవహారాల్ని దుయ్యబట్టడానికి పూనుకొన్న చలం పదునైనభాషలో, సూటైనశైలితో ఉద్యమించాడు. కొడవటిగంటి ఆర్థిక, సామాజిక కథాంశాల్ని, గోపీచంద్ రాజకీయాల్ని జోడించి కథా వస్తురంగాన్ని విస్తృతపరిస్తే బుచ్చిబాబు, పాలగుమ్మి పద్మరాజు ప్రభృతులు మనోలోకాన్ని తరచిచూచారు. మునిమాణిక్యం, నోరి నరసింహశాస్త్రి మొదలగువారు భార్యాభర్తల సరసాన్నీ, ప్రణయాన్నీ, ప్రణయ కలహాల్ని వర్ణించారు. రసరమ్య జీవితాలకు అద్దంపట్టి మల్లాది రామకృష్ణశాస్త్రి కథలువ్రాస్తే క్రిందితరగతి వాళ్ళకుజరిగే అన్యాయాల్ని కథావస్తువుగా ఎన్నుకొని ప్రతిభావంతంగా తీర్చిదిద్దారు రాచకొండ, విశ్వనాథ మున్నగువారు.

ఈ విధంగా మన రచయితలు సమాజంలో అట్టడుగున నున్న పేదవాడు మొదలు ఉన్నత స్థితి నాక్రమించిన ఆగర్భ శ్రీమంతునివరకు ఎన్ని తీరుల సమస్యలు, ఎన్ని రకాల ప్రవృత్తులు, ఎన్ని ఆరాటాలు ఎదురవుతూఉంటాయో, అన్నిటిని కథావస్తువులుగా స్వీకరించారు. సంస్కృతి సంప్రదాయాలు, వివాహ సమస్యలు, దాంపత్యజీవనం, నిరుద్యోగం, సాంఘిక నేరాలు, దురాచారాలు, రాజకీయ ప్రభావాలు మొదలైన అంశాల్ని వివిధ కోణాలనుండి తరచిచూచి, స్పందించి కథానికలు వ్రాశారు.

ఇక శిల్పమంటే ఒక సంఘటనను వార్తగాకాక కథగా చిత్రించ గల్గడం. కథకుడి ఉపోద్ఘాతంతో మొదలై, దేశకాలపాత్రల వర్ణనలతో నిదానంగా మత్తగజంలా సాగిపోయేది జానపదకథాకథనం. అది గురజాడ చేతుల్లోనే విప్లవాత్మకంగా మారిపోయి, శిల్పవిన్యాసాన్ని ప్రదర్శించింది. దాని ఎత్తుగడలో, పాత్ర ప్రవేశంలో, వర్ణనలో, సంభాషణలో, ముగింపులో నిశితత్వం, సంక్షిప్తత ఏకాంతవ్యగ్రత, ప్రాముఖ్య మందుకున్నాయి. కథఎక్కడో మొదలవుతుంది, కొంత సాగుతుంది, టక్కున మలుపు తిరుగుతుంది, ఘర్షణ ఏర్పడుతుంది, పరాకాష్ఠ నందుకొంటుంది. కథా వస్తువునుబట్టి వీటిని రచయిత నిర్ణయించుకుంటాడు. పాఠకుడు గ్రహింపగల్గే అంశాల్ని [illegible]వాటికే వదిలేస్తాడు. కథను ఇలా ప్రారంభించి ఇలాముగించాలి అని గిరులుగీయడం సంప్రదాయ [illegible]. ఈ పద్ధతి పాతబడిపోయింది. నేటికథానికా రచనలో రచయిత తనకు గల స్వేచ్ఛను పూర్తిగా వినియోగించుకొంటున్నాడు. మంచిప్రారంభం, చక్కని ముగింపూ కథకు నిండుదనాన్నిస్తాయి.

గురజాడ కాలంలో కావ్యభాషలోనే కథానికా రచనసాగింది. కాని తరువాతికాలంలో వ్యావహారికభాష కథానికల్లో పూర్తిగాచోటు చేసుకుంది. చింతా దీక్షితులు, తల్లావఝ్ఝుల, శ్రీపాద, వేలూరి శివరామశాస్త్రి ప్రభృతులు మొదట కావ్య భాషలోనే కథలు వ్రాస్తూ వచ్చినా, చివరికి వ్యావహారిక భాషను ఆదరించకతప్పలేదు. వేగవంతమై, ప్రబల భావస్ఫోరకమైన వాక్య నిర్మాణం చలంతో మొదలైంది. తన పరిసరాల్లోని శిష్టజనవ్యావహారికాన్ని విన్నట్లు వ్రాసిన వాడు శ్రీపాద. కథానికా రచనలో చేసిన రకరకాల భాషా ప్రయోగాలు మంచి ఫలితాల్ని ఇచ్చాయి. పాత్రల స్థాయిని, తమ అభిరుచిని, బట్టి రచయితలు శిష్టవ్యావహారికం మొదలు జానపద మాండలికం వరకు అన్నివిధాలైన భాషాభేదాల్లోను రచనలు సాగించి కృతకృత్యులయ్యారు.

సంగీతంలో తాళం ఎటువంటిదో సాహిత్యంలో శైలిఅటువంటిది. అది కథాగమనాన్ని క్రమబద్ధం చేస్తుంది. కథానికకు వర్ణనఅంతగా అవసరం లేదు. సన్నివేశ చిత్రణమే దీనికి ప్రాణమైనా పాత్ర చిత్రణకూడ ఉపేక్షింపరాని ధర్మం. కథానికా రచన సంక్షిప్తంగా ఉండి. భావనాక్రమను బుద్ధిక్లేశాన్ని కలిగింపక స్వాభావికంగా ఉండాలి. [illegible] ఉత్కంఠతనూ, అంతమందు ఆశ్చర్యాన్నీ కలిగించాలి. కథానికా రచయితకు ఏకా

ప్రాణం అవసరం. కథా సంకలన ప్రతిమ బట్టి ఎక్కడా సిరుసత్వాలగాని, చలించదనం గానీ, కంటికనబడేగాని లేకుండా మన మున్సను ఆకట్టేటంత శక్తితో కథ సాగిపోవాలి. పాఠకులయిలో అలక్ష్మనియకృతులు చెప్పిన 'Imaginative pleasure' (భావ నాహ్లాదము) మన కథానికలకు అవసరమైంది. అలాంటి ఆనందాన్ని ఇచ్చినప్పుడే ఆది కావ్యమి కేవలంగా పరిగణించ బడుతుంది.

గడచిన పదేళ్ళలో నవలల్లాగా కథా సంపుటాలు విరివిగా వెలువడలేదన వచ్చు. ప్రతివారం, ప్రతినెల పత్రికల్లో కథలు విరివిగా వస్తున్నప్పటికీ, వాటిలో పుస్తక రూపంలో వస్తున్నవి చాలా తక్కువ. మధురాంతకం రాజారాం, కొండముది శ్రీరామచంద్రమూర్తి 'పాము లాంటి బతుకు'; మంజుశ్రీ భమిడిపాటి రామగోపాలం 'వంటొచ్చిన మొగాడు'; కొవ్వూరి వేణుగోపాలరావు, సింగరాజు లింగమూర్తి 'సుమామూర్తులు'; రావికొండ విశ్వనాథశాస్త్రి 'బాకీ కథలు'; పురాణం సుబ్రహ్మణ్యశర్మ 'ఇల్లు'; వాసిరెడ్డి సీతాదేవి 'మిసెస్ కైలాసం'; శీలావీర్రాజు 'పగ మైనస్ ద్వేషం'; అంగర వెంకట కృష్ణారావు 'కదిలే బొమ్మలు'; డి. కామేశ్వరి 'ఆశకని బ్రతుకులు'; రావూరి భరద్వాజ 'వసుంధర' నగ్నముని 'నగ్నముని కథలు'; ఆచంట శారదాదేవి 'ఒకనాటి అతిథి'; డా. నాయని కృష్ణకుమారి 'అయాధా'; దీనాదేవి 'డబ్బు!! డబ్బు!!' అవసరాల రామకృష్ణారావు 'నాకు నువ్వా సిన సేనూ'; వి. యస్. రావు 'ఊరుమ్మడి బ్రతుకులు'; అమరశ్రీ సంకలనం 'పూలజల్లు'; హితశ్రీ, తాళ్ళూరి నాగేశ్వరరావు సంకలనం 'మాట పదహార్లు'; చిత్తూరు రచయితల 'ఊరేడులోకాలు'; విశాఖ రచయితల 'ప్రతిబింబాలు'; యువభారతివారి 'పదచపటి'; ఎమెస్కో వారి

( తరువాయి 4 వ పేజీలో )

# శ్రీమద్రామాయణము - కల్పవృక్షము

— భారతీప్రియ.

శ్రీమద్రామాయణము భక్తితో పారాయణము చేయువారికి కల్పవృక్షము వంటిదని భారతజాతి యంతయు తెలిసినదే. అందుకే శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు తమ రామాయణ రచనకు శ్రీమద్రామాయణ కల్పవృక్షమని సార్థకముగా నామకరణము గావించిరి. మనముకూడ వాల్మీకి మహర్షి అందించిన శ్రీసీతారామ పుణ్య జీవితఫలమును అనుభవించుచున్నాము. గనుక శ్రీమద్రామాయణము లోని కల్పవృక్ష తత్త్వమును తెలుసుకొందము.

మహర్షి వాల్మీకి రామాయణములోని కల్పవృక్ష తత్త్వమును మనము తెలుసుకొనుటకే అందలి భాగములకు కాండము అని పేరుపెట్టెను. కాండమనగా చెట్టు మాను. భూమిలో పాతుకొని యున్న వేళ్లను వెలుగులో విస్తరించియున్న ఆకులను కలుపునది కాండభాగము. సీతాదేవి భూమినుండి పుట్టినది. గనుక భూమిలో పాతుకొని యున్న వేళ్లవంటిది. శ్రీరాముడు సూర్యవంశమువాడు గనుక వెలుగులో విస్తరించియున్న ఆకులవంటివాడు. వీరిద్దరి కలయిక గురించి విస్తరించేది_వేళ్ళను, ఆకులను కలిపే షట్కాండ సమాహారమైన రామాయణ కల్పవృక్షం.

రామాయణములోని కల్పవృక్ష తత్త్వము మనము తెలుసుకొనుటకే అందలి నాయిక అయిన సీత_భూమినుండి పుట్టినట్టుగా చెప్పబడినది. చెట్టు భూమినుండి పుట్టును కదా. అట్లు పుట్టుటకు కారణమేమి? సీత_అనగా నాగటిచాలు అని అర్థము అనగా నాగటిచే దున్నబడిన భూమిలోని సారము. భూమిలోని సారమే కదా ముఖ్యము. విత్తనము ఎన్నియో బస్తాలో మూటకట్టినచో మొలకెత్తునా?_ మొలకెత్తవు. భూమిపై పారబోసినచో మొలకెత్తునా?_ కొన్ని మొలకెత్తును. కొంతవరకు పెరుగును. ఫలితము నుండే నశించిపోవును. అట్లుగాక విత్తనము మొలకెత్తి ఏపుగా పెరిగి మహావృక్షమై ఫలవంతము కావలెనన్నచో భూమినిదున్ని సారవంతము చేయవలెను. అట్టి భూసారమున విత్తనము నిమిత్తమాత్రముగ విస్తరించి మహావృక్ష రూపము సంతరించుకొనును. ఆ భూసారమే సీత. ఏ జాతి విత్తనమునుండి ఆజాతి వృక్షమే మొలకెత్తును. కాని అన్ని విత్తనములనుండి అన్ని జాతుల వృక్షములుగా మొలకెత్తునది భూసారమే. కనుకనే దీనిని 'కల్పవృక్షము' అనిరి. వృక్షమనగా మనకు తెలిసిన చెట్టు. కల్పవృక్షమనగా - కల్పింపబడిన వృక్షము. పురాణములలో - కల్పవృక్షము గూర్చి చదివి పాపము చాలామంది పండితులు అది ఊహాకల్పితమైనవృక్షము అని అనుకొందురు. కల్పవృక్షము అనగా "వృక్షముగా కల్పింపబడిన భూసారము" అని తెలుసుకొనవలెను. ఆ భూసారము సీతయే కనుక శ్రీమద్రామాయణము కల్పవృక్షమైనచో ఆ కల్పవృక్ష రూపము సీతామహాదేవియే.

రామాయణములోని కల్పవృక్షతత్త్వమును మనము తెలుసుకొనుటకే శ్రీరాముడు సూర్యవంశమువాడని చెప్పబడినది. వృక్షములు సూర్యరశ్మిలో_కిరణజన్య సంయోగక్రియ (Photo synthesis) జరిపి ఆహారము తయారు చేసుకొని పెరుగుచున్నవి. అట్లే భూజాత అయిన సీత జీవితము సూర్యవంశజుడైన శ్రీరాముని చేపట్టుటలో విస్తృతి పొందినది. రాముడు సూర్యవంశము వాడనగా సూర్యునినుండి కిరణప్రసార రూపమున వెలువడు వెలుగే. రాముడు అనగా తాను రమించువాడు. తనవారిని రమింప జేయు

వాడు. అనగా తాను ప్రకాశించువాడు. తనవారిని ప్రకాశింపజేయువాడు. ఇది వెలుగుయొక్క లక్షణముకదా. వెలుగు తానుప్రకాశించుచు తన వెలుగులో తక్కిన వస్తువులను వ్యక్తముచేయుచుండును. శ్రీరామునిబట్టికదా సీత విశ్వవిఖ్యాతఅయినది. అట్లే సూర్యుని వెలుగే-వృక్షములయందు ఆహారరూపమునహించి విస్తృత రూపము పొందుచున్నది. మనము తిను ఫలములలో-వాని రుచిగా మనకు ఆనందము కలిగించున దేది. మామిడి పండు! ఎంతరుచిగానుండునో - జామిరుచి మఱియొకదానికి రాదు. పనసతో నల ముందు అన్నిరుచులు దిగదుడుపే. ఇట్లు మన మనుభవించు రుచులన్నియు ఆ ఫలములకెట్లు కలుగుచున్నవి. పాపము శాస్త్రజ్ఞుల దృష్టిలో- అన్ని ఫలములలో నున్నవి-పిండిపదార్థములు, మాంసకృత్తులు, క్రొవ్వు పదార్థములే. ఇవన్నియు పండులోని రుచిగా ఎట్లు పరిణతి చెందుచున్నవో వారెరుగరు. అన్నిరుచులుగా జీవులజిహ్వలకు రుచించి ఆనందము కలిగించునది ఆ సౌరశక్తియే కదా- ఆ సూర్యుని వెలుగేకదా- అతడే మరి సూర్యవంశము వాడని వాల్మీకి మహర్షి ప్రణుతించిన శ్రీరాముడు. సీత జీవితము కల్పవృక్ష రూపమైనచో శ్రీరాముని జీవితము ఆ వృక్షఫలము యొక్క రుచియే.

ఈ సత్యము మనము దర్శింప గలిగినపుడు మరియొక పరమసత్యము దర్శనమగును. మొదట భూమి నుండి వేర్ల ద్వారా లవణజలము సూర్యుని నుండి వెలుగు గ్రహించి జీవించు వృక్షములలో జరుగు భూసౌరశక్తుల సంయోగమే సీతారాముల జీవితముగా మనము గ్రహించినచో తరువాత పరమసత్యము అనుభూత మగును. భూమి అనగా భౌతిక పదార్థము (Material) మనవారు వేదాంతము జీర్ణమై ఈ శరీరములు మట్టికుండలవలె భూమిలో పుట్టి భూమితో కలిసి పోవునని చెప్పుచుందురు. భూమిఅనగా మనము నడుచు నేలమాత్రమే కాదు. సకలప్రాణి వస్తుకోటియొక్క రూపమునకు కారణమైన భౌతికపదార్థము.పంచభూతములలోనిది. భూమికి సంబంధించినది కనుక అట్టి భూతతత్త్వము నుండి పుట్టిన మన శరీరములన్నియు భూజాత అయిన సీతాదేవి యొక్క ప్రతీకలే అని తెలిసికొనవలెను. మరి ఈ శరీరము లన్నియు గోడలవలె బల్లలవలెకాక నిద్రాహార మైథునములు కలిగియున్నవి కదా.

భావరూపమున ఈశరీరములను సజీవములుచేయుచు జీవించు చున్న దెవరు ? మనలో ఆకలిగా, కామముగా, క్రోధముగా, థర్మామీటరుకు టెంపరేచరుగా తగులుచున్న దేది, ఎవరిది ? వేడి- వెలుగు యొక్క లక్షణముకదా. ఆ వెలుగెవ్వరు? మనకు తెలిసిన వెలుగుల పుంజము సూర్యభగవానుడేకదా. ‘అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహ మాశ్రితః’ అని గీతాచార్యుడు చెప్పినది ఆ వెలుగును గూర్చియే కదా. కావుననే సూర్యుడు లేనపుడు నిద్రలోనుండి పోవు మనము సూర్యోదయముతో మెలకువను పొందుచున్నాము. అనగా సకలప్రాణికోటియును సూర్యుని వెలుగు రవ్వలమని తెలియుచున్నదికదా. ఈవిధముగా మన యొక్క భౌతిక శరీరధారణ, ప్రాణ శరీరధారణయే సీతారాముల జీవితముగా మనము గ్రహించినచో-సృష్టిలో నిత్యము వర్తించుచున్న శ్రీమద్రామాయణ సత్యము మనకు గోచరమగును. సూర్యుని వెలుగుతో - సకల చరాచర కోటితో-వెలుగులోనికి వచ్చుచున్న భూగోళము యొక్క ఉనికియే సౌరభౌతిక తత్త్వ సమ్మేళనమునకు సంకేతముగా చెప్పబడిన సీతారాముల జీవితమైన శ్రీమద్రామాయణమునకు ప్రత్యక్ష నిదర్శన మను దర్శనము లభించును.

ఈవిధముగా బాహ్యసృష్టిలోని భూభౌతిక సౌర తత్త్వ సమ్మేళనము చేత కల్పవృక్షముగా చెప్పబడుటయేకాక-మరికొన్ని కారణముల చేత కూడ శ్రీమద్రామాయణము-లోనికల్పవృక్ష లక్షణము వ్యక్తమగు చున్నది. వానిని పరిశీలింతము.

రామాయణకథలో ప్రధాన ఘట్టము సీతారాముల వనవాసము. వనవాసమే లేనిచో సీతాపహరణమే జరుగదు. రావణసంహారమే లేదు. అసలు రామాయణమే ప్రవర్తింపదు. ఈవనవాస రహస్యము తెలుసుకొందము. రామాయణములోనే కాదు. భారతమునందును పాండవ వనవాసమే ప్రధాన ఘట్టము. ఆర్షకవులు-ఈవనవాస పరమార్థము బాగుగా దర్శనము పొందినవారు. వనము అనగా వృక్షముల సమూహ మన్నది మనకు తెలిసి

---

( 2 వ పేజీ తరువాయి )

“విద్యార్థి సాహితీ కథాంజలి”, ఆర్. వసుంధరాదేవి ‘గాలి రథం’ మొదలైనవి గడచిన దశాబ్దంలోవచ్చిన కొన్ని వాడి, వేడి, గల కథా సంపుటాలు. చిన్న అద్దంలో విశాలమైన దృశ్యాన్ని చూడగల్గినట్లుగా పెద్దసన్నివేశచిత్రణను కథానికలో చూడవచ్చు. నవలలోని బహుసన్నివేశ చిత్రణ పరాకాష్ఠకు చేరిన పరిణామ స్థితియే ఈ కథానిక. విజ్ఞానంతో పాటు వినోదాన్ని అందిచ్చే సాహితీ ప్రక్రియఅయిన కథానిక, యథార్థజీవితానికి రూపకల్పన అనడం ఎంతైనాసమంజసం.

ఈవ్యాస సంప్రదాయం దానికి ఉపకరించిన గ్రంథములు :-

1. సాహిత్యోపన్యాసములు - కథానిక - డా॥ పోరంకి దక్షిణామూర్తి.

2. ‘మహతి’ లోని కథానికా వ్యాసములు.

8. సాహిత్య శిల్పసమీక్ష - ఆచార్య పింగళి లక్ష్మీకాంతం.

వనే. అంతేనా అక్కడైనచో నివసించుటకు భయమేల? వన మనగా ఉద్యానవనము కాదు. మహారణ్యము. క్రూర జంతువులకు నిత్యనివాసము. ఘోరవిపత్తులకు విశేషాకరము. అట్టి వనవాసము జాగ్రత్తగా నిర్వహించిన వారికి ఒక నేర్పరితన మలవడును. చెట్లు రుచికరమైన ఫలములతో మనకు ఆహారము నిచ్చును. కానీ ఆచెట్ల క్రింద పుట్టలో, తొఱ్ఱలలో నున్న పాములు పొదరిండ్లలో దూరిన పులులు, సింహాలు, చెట్లను మొదలంట పెకలించి పడవేయు ఏనుగులు వీటన్నిటిని మించి మహావృక్షముల నాశ్రయించి యుండు రాక్షసులు, భూతములు_వనవాసము చేయునపుడు మనలను బాధించును. ఇదొక విచిత్రసత్యము. అరణ్యములో ఏచెట్టువలనఁగాని మనకు ప్రమాదము లేదు గాని అందు నివసించు క్రూరజంతువుల వలన ఘోరవిపత్తులు క్షణములో కలుగు ప్రమాద మున్నది. ఈ ప్రమాదము తప్పి బయట పడుటయే వనవాస నిర్వహణములో మనము పొందవలసిన అనుభవము.

ఇట్టి సన్నివేశమే సరిగా మన శరీరములోని నాడులయందు వర్తించుచున్నది. భౌతిక శరీరమునందున్న మన నాడులకు భౌతికవస్తు వ్యక్తులతో సంబంధము కలదు. కాని ఆయా, వ్యక్తులపై అనేక అభిప్రాయములు, రాగద్వేషభావములుగా అందు ప్రవహించుచుండును. అట్లే ఎదుటి వ్యక్తుల (జంతువుల) శరీరముల యందలి నాడులలో మనపై రాగద్వేషములు ప్రవహించుచుండును. ఎదుటివ్యక్తి శరీరము ఉన్నట్టుండి మనమీదపడు ప్రమాదములేదు గాని_దానిలోని ఏనుగువంటి అహంకారము విజృంభించినపుడు మనకు నడుము విరిగే ప్రమాద మున్నది. నాడుల విషయముకూడ నింతే. మన కేదో ఇతరులు కష్టము కలిగింతు రని విషపూరిత భావములతో నిండి వారికి నష్టము కలిగింతుము. ఇట్టి భావములు నాడులలో ప్రబలమైనపుడు జీవితము వనవాస మగును. ఇట్టి విషభావములకు కారణము మన వ్యామోహమే. ఈ వ్యామోహమువలన ఇంద్రియ సుఖములు మనశరీరమును తమవశముచేసుకొనుటకు సర్వదా సర్వథా ప్రయత్నించును. అదియే రావణుని సీతాపహరణము.

ఇట్లు అపహరించ బడిన సీతను అన్వేషించుచు రాముడు సుగ్రీవమైత్రిని పొందెను. హనుమంతుడు శ్రీరాముని దూతగా లంకకువెళ్ళి సీతను దర్శించివచ్చెను. తరువాత వానరసైన్య సహాయములోనే రాముడు నీరధికి వారధి కట్టి సీతమ్మను తెచ్చుకొనెను. సీతారాములకు పునః సమాగమము గావించిన హనుమంతుడు మొదలుకొని సుగ్రీవాది వానరులందరు వనచరులే. వన మనగా ఏమియో చెప్పుకొంటిమిగదా. కోతి చాంచల్యమునకు గుర్తు. మన నాడులలో చీటికి మాటికి చిందులు త్రొక్కు తలపులే వనచరులైన వానరసైన్యము. వారికి రాజు సుగ్రీవుడు. అనగా'సు'గ్రీవము-మంచి కంఠము. సంకల్ప రూపమైన తలపులెన్నో వాక్ రూపమున వ్యక్తమగు కేంద్రము కంఠము. అందువలన సుగ్రీవుడు వానరరాజుగా చెప్పబడుచున్నాడు. అందు నిలకడ పొందిన తలపు సంకల్పమై వాక్కుగా స్థిరపడును. వాక్కు_అనగా మనసులో ఏకీభవించిన ప్రాణమే. కనుకనే హనుమంతుని సుగ్రీవునకు మంత్రిగా (మనకు సంకల్పము) వాయుపుత్త్రుడుగా (ప్రాణవాయురూపముమైన వాక్కు) వర్ణింపబడినాడు. ఇట్టివాక్కు స్థిరమైనమన సంకల్పమును దర్శింప గలుగును. ఇదియే హనుమంతుడు సీతను దర్శించినట్లుగా చెప్పబడినది.

ఆత్మనుండి వెలువడు వాక్కు శ్రీరామునకు దూతయైన హనుమంతుడు. వాక్కు మన సంకల్పమును వెల్లడించుటయే హనుమంతుడు సీతను చూచివచ్చుట. ఈవిధముగా సీతారాముల పునఃసమాగమమునకు ప్రాధాన్యము వహించిన వానరులు వనచరులగుటచేత కూడ శ్రీమద్రామాణము కల్పవృక్షము అనుటకు దోహదకారిగా నున్నది. అట్లే సీతాదేవి అశోకవనము నందుండుట అనగా శోకములేనినాడులయందు నిర్మలముగా నిశ్చలముగా మన సున్నండుట. పైని చెప్పుకొన్నట్లు, ఆవనమునందున్న భూతపిశాచ రాక్షసగణములు సీతను బాధపెట్టజూచినవే కాని ఆమె కించిత్తును బాధపడలేదు. కనుకనే అశోకవనము అని చెప్పబడినది. అట్లే సీతా దర్శనానంతరము హనుమదాదులు మధువనమును చిందర చేసి మధుఫలములు మత్తుగా సేవించుట మనస్సునెరిగిన ఊహాలు పరిపరివిధముల తీయని అనుభూతితో చిందులు త్రొక్కుటయే. మానవ జీవితము ఊహాకల్పితమైనవృక్షముగా భావించు కొన్నచో దేహ మను భూమిలో పాతుకొనియున్న వేళ్ళవంటి మనస్సును, సృష్టి అను వెలుగులో విస్తరించియున్న ఆకుల వంటి ఆత్మను కలుపునట్టి ప్రాణశక్తి వాయుపుత్త్రుడైన హనుమంతుడు. వారి సమాగమమున కలుగు తియ్యని అనుభూతితో కూడినతలంపులే మధువనచరులైన వానరులు. వారి పరస్పరస్థితిని తెలిపి కలుపు ప్రాణమయమైన వాక్కు హనుమంతుడు. ఇది మానవజీవిత క్షేత్రమున శ్రీమద్రామాయణ కల్పవృక్షము మొలకెత్తి పెరుగునపుడు దర్శన మగు జలజీవముల విశేషములు.

యుద్ధకాండమున లక్ష్మణుడు మూర్ఛ చెందినపుడు హనుమంతుడు సంజీవనిని తెచ్చిరక్షించుట కూడ రామాయణకల్పవృక్షతత్త్వము తెలుసుకొనుటకు అనుగుణముగా నున్నది. లక్ష్మణు డనగా పరమాత్మకు గుర్తుగా జీవించువాడు. కల్పవృక్షమనగా అన్ని విత్తనముల నుండి

మొలకెత్తి విస్తరించు వృక్షధర్మము. ఇది వృక్షసామాన్యమునకు సంబంధించినది.

ఒక మామిడిచెట్టు గాని, జామిచెట్టు గాని ఈవృక్షధర్మమునకు గుర్తులుగా ఉన్నట్టివే. లక్ష్మణు డట్టివాడు. అతడు మానవమేధకు గుర్తు. వృక్షముల ప్రత్యేకత మామిడి, జామమున్నగుజాతి ప్రత్యేకతయే లక్ష్మణుడు. మానవమేధ ఇంద్రియ విజృంభణముచే(ఇంద్రజిత్తు విజృంభణ) జాడ్యము వహించి నపుడు ప్రాణశక్తియొక్క సంజీవనలక్షణము మానవుని మరల వ్యక్తిగా పునరుజ్జీవింపజేయును. అట్లే ఆయావిత్తనముల యందు జడముగానున్న ఆయాజాతి వృక్ష లక్షణము మొలకెత్తినపుడు పునరుజ్జీవించి ఆయా వృక్షములుగా విస్తరించును. అట్లు విస్తరించుటలో సంయోగము చెందు భూసారసౌరశక్తుల సమ్మేళనమే సీతారాముల జీవితము కాగా ఆవృక్షమే లక్ష్మణు డగును. ఈవిధముగా రామాయణమున సీతారామలక్ష్మణులు మువ్వురు ప్రాధాన్యము వహించుటను బట్టి కల్పవృక్షలక్షణము విశదమగు అరణ్య కాండము నందు సీతారామలక్ష్మణులు పంచవటిలో పర్ణశాలయందు నివసించిరని చెప్పబడినది. పర్ణశాల అనగా పర్ణములకు నిలయమైన వృక్షమే. ఈవిధముగ మానవజీవితమున శ్రీమద్రామాయణ కల్పవృక్షముగా విస్తరించి సమస్తకోటి జీవితము సకల బ్రహ్మాండ గోళముల అస్తిత్వము, భూమి సూర్యశక్తుల సమ్మేళన జన్యమును పరమ సత్యమును దర్శనము చేయించుగాక. బ్రహ్మానందానుభవము సీతారామభక్తుల కందఱికి లభించి హనుమ దనుగ్రహముచే లక్ష్మణులై ఆత్మజ్ఞాన పునరుజ్జీవనము పొందురుగాక.

—•••—

# నాదయోగి

— శ్రీ శనగన నరసింహస్వామి, ఎం. ఏ.

నిధికోసము రాజుల స
న్నిధిలో పాడుదురు భువిన నేకులు నీవో
నిధి దుఃఖమనుచు హరి స
న్నిధిలో పాడితివి సౌఖ్యనిధులు లభించెన్.

నారదుండవో తుంబురుండవో మహాను
భావ! గానము ముక్తిసోపాన మనుచు
చాటినావు జగజ్జన సరస హృదయ
తంత్రులను మీటుచున్నావు తరతరముగ.

'దాశరథి!' యంచు 'కౌసల్య తనయ!' యంచు
చెలులు చిన్నారి రాముని పిలువరంట!
'త్యాగరాజ వరద!' యంచు తరిమి పిల్తు
రంట! ధన్యుడవయ్యా! గాయకవతంస!

భాగవతంబునందు బహుభంగుల శ్రీహరి బ్రస్తుతించియున్
భాగవతోత్తముండయిన బమ్మెరపోతన తృప్తిగాంచమిన్
త్యాగయ! నీవమైమఱల ధారుణిపై నుదయించెఁ గానిచో
సాగునె రాజసత్కృతులు సైపని పావనగాన సాధనల్?

నీ 'తెరతీయరాద' కృతి నేరుపులెట్టివో స్వీయమూర్తిపై
మూతలు తీసెనంట! రసముగ్ధుడు వేంకన; బ్రహ్మరాణి కెం
జేత హసించు కచ్ఛపియె సిగ్గిలెనంట! తదీయ సంస్మృతిన్
భూతలమెల్ల నిప్పటికి పొంగులువారును త్యాగరాణ్మణీ!

# వటవృక్ష వర్ణన - ధూర్జటి, కృష్ణదేవరాయలు.

— శ్రీ డా. ఎస్. గంగప్ప, ఎం. ఏ. పిహెచ్. డి.

వటవృక్షం అనగానే మనకు బ్రహ్మరాక్షసులు గుర్తొస్తారు. మర్రిచెట్టుకీ మంత్రాల మారిగాళ్లకూ సంబంధం గోచరిస్తుంది. భూతభేతాళ పిశాచాదులకి మర్రి నిలయం. పైగా అభూత భేతాళ పిశాచాదుల రహస్యాలు ఈమర్రిలో ముడిపడి ఉండడం విశేషం. ఈసంగతి మనకు పుక్కిటి పురాణాల్లోను, కట్టుకథల్లోను మాత్రమే కాక, మన శిష్టసాహిత్యంలో సైతం ప్రఖ్యాతమే. విక్రమార్కుని కథల్లోను భేతాళుడికీ, ఈమర్రికీ సంబంధం ఉంది. అలాగే బాలనాగమ్మ కథలో మర్రి, దానిలో ఓ చిలుక, చిలుక ప్రాణంతో మాయలమరాఠీ ప్రాణం ముడిపడి ఉండడం మనకు సువిదితమే.

మన సాహిత్యంలోని వటవృక్షాల్ని గూర్చి తెలుసుకోనేముందు ఇప్పటికీ ప్రసిద్ధికెక్కిన మర్రిచెట్లనుగురించి ముచ్చటించుకోవడం అనవసర మేమీకాదు. భారతదేశంలో ఈనాటికీ ప్రసిద్ధి వహించిన వటవృక్షాలున్నాయి. మద్రాసు అడయారులో ఓ ప్రసిద్ధ వటవృక్షముంది. అలాగే కలకత్తా నగరంలో మరొకటీ ఉంది. ఇక మనరాష్ట్రంలో రాయలసీమలో అనంతపురంజిల్లా కదిరితాలూకాలోని గూటిబయలులో ఒకటీ, తెలంగాణాపిల్లలమర్రిలో మరొకటీఉన్నాయి. వీటన్నింటిలో మహావటవృక్షం కదిరి గూటిబయలులోనిది. తిమ్మమ్మమర్రిమాను అని దీని పేరు. ఇది ప్రపంచ ప్రఖ్యాతి పొందింది. అడయారులోని దానికంటే, కలకత్తాలోదానికంటెకూడా ఇది పెద్దది. సుమారు ఆరున్నర ఎకరాల విస్తీర్ణంలో ఇది వ్యాపించిఉంది. మరి ఎందరు బ్రహ్మరాక్షసులు దీన్నిఆశ్రయించి ఉన్నారో మనకు తెలియదు. కాని ఒకటి మాత్రం వాస్తవం.తిమ్మమ్మమర్రికింద నిద్రించినవాళ్లకుమాత్రం శుభాలుచేకూరుతాయన్న ప్రగాఢ విశ్వాసంమాత్రం ప్రజల్లోఉంది.

ఇది ఇలాఉండగా తెలుగు ప్రబంధకవుల్లో ఒకకవీ, మరొకకవిరాజు వటవృక్షబ్రహ్మ రాక్షసుల్ని అభివర్ణించి, తమ వర్ణనా వైదగ్ధ్యాన్ని ప్రకటించుకొన్నారు. శ్రీకృష్ణదేవరాయలు మాలదాసరి కథలోను, ధూర్జటి నత్కీరుని చరిత్రలోను ఈ వటవృక్ష బ్రహ్మరాక్షసుల్ని సందర్భోచితంగా వర్ణించారు. వాటిని సంగ్రహంగా పరిశీలిద్దాం.

ఆముక్తమాల్యదలోని మాలదాసరికథ రాయలస్వభావానికి చక్కటి నిదర్శనం. మాలదాసరి మంగళ కైశికీరాగంలో శ్రీవిష్ణువును అనునిత్యమూ స్తోత్రంచేస్తూ ఉండేవాడు. ఒకనాటి అర్ధరాత్రి సమయంలో పిల్లిరావండతో కోడి కొక్కొరొకోమంది. అదివిన్న ఆమాలదాసరి తెల్లవారుతోందని తలచి స్తుత్యర్థం వెళ్లుతాడు. కన్నుపొడుచుకొన్నా కానరాని కటిక చీకటిలో దారితప్పి తిరిగాడు. తెలతెలవారుతూండగా ఎదుట ఒక వటవృక్షం కనిపించింది.

'కాంచె న్వైష్ణవుఁ డర్ధయోజన జటా
ఘాటోత్థ శాఖోపశా
ఖాంచజ్ఝాట చరన్మరుద్రయ దవీ
యః ప్రేషితోద్యచ్ఛదో
దంచత్కీటకృత వ్రణచ్ఛలన లి
ప్యాపాది తాధ్వన్య ని
స్సంచారాత్త మహాఫలోపఫల
స్ఫాయ ద్వటక్ష్మాజమున్."

- (6_15) - ఆమాల దాసరి రెండు యోజనాల పర్యంతం వ్యాపించిన శాఖోపశాఖల సమూహంలో సంచరిస్తున్న గాలివల్ల దూరంగా త్రోసి వేయబడ్డ ఆకులలో ఉన్న కీటకాలు తొలిచిన రంధ్రాలనే వ్రాతచేత కూర్చబడ్డ బాటసారుల సంచారం లేకపోవడంచే కలిగిన మహాపుణ్యంతో సమానమైన పండ్లతో విస్తరించిఉన్న వటవృక్షాన్ని చూశాడు. ఈపద్యం శ్రీకృష్ణదేవరాయల వర్ణనావైదగ్ధ్యానికీ, సంస్కృత సమాసధూయిష్ఠ రచనా పాటవానికీ, నారికేళ పాకానికీ, ఓజోగుణవైశిష్ట్యానికీ చక్కటి ఉదాహరణం. ఆ వట వృక్షాన్ని ఆశ్రయించి బ్రహ్మరాక్షసుడు వ్రేలాడడం సహజమే గదా? కాబట్టి రాయలు బ్రహ్మరాక్షసుని చాలామనోజ్ఞంగా వర్ణించడం గమనించదగ్గ విషయం.

'మృతమర్త్యు రెంటానవనిడ్డఁజాలకౌత్రు
రంజిల్లు పెనుబొడ్డు ముంజివానిఁ
బల్లచీమల వక్రభల్లాతకిరుఁబోలె
కెఱ్ఱి దుప్పటి నొప్పు కత్తివాని,
వ్యత్యస్తహస్తిమస్తాభఁ బాయుకు గడ్డ
మును దంష్ట్రికలుఁ బొల్చు మొగము
వానిఁ
గడుదుర్లనిడుతుట్టెగతిఁ జొంగలోఁ
బాండు
రతమించుకపిల కూర్చంబువాని,

నెఱసుఁ దెఱువరిఁగనశాఖ లెక్కు జాఱు
ప్రేవుజందెంబు గసరిపైఁ బెట్టువాని,
వ్రేలుడగు బొజ్జగల బూరగాలివానిఁ,
జెంబు తలవాని నవటు కచంబువాని'

'కండకన్నుల వాని, నాఁకటను బండ
తిట్లు బేతాళికల సారెఁ దిట్టువాని,
నగగిరివాని, నన్వర్థనాముఁ గుంభ
భానువను నొక్క ద్విజనిశాచరునిఁ
గనియె.'

(6-19, 10) - ప్రబంధకవిత అంటే వర్ణనలనే అర్థం కదా! పైగా ప్రబంధకవులు ప్రబంధకన్యా వర్ణనలతోనే అలసి సొలసిపోయిన వాళ్లు. రాయలు అలాకాక, ఒక వ్యక్తి అందునా, ఒక బ్రహ్మరాక్షసుని వర్ణించటంలో తన

సహజ నిశితశంశీలనను జోడించినట్లు స్పష్టం. ఈవర్ణన మనకు కన్నులకు కట్టినట్లుండి సహృదయరంజనం చేస్తుంది.

ఇలాగే అష్టదిగ్గజాల్లోని మదేభమైన ధూర్జటి శ్రీకాళహస్తి మాహాత్మ్యంలో నత్కీరుని కథలో వటవృక్ష బ్రహ్మరాక్షసులవర్ణనచేయడం గమనించవచ్చు. నత్కీరుడు శివుని చే శపింపబడి కుష్ఠరోగగ్రస్తుడై, తద్విముక్తి కోసం కైలాసపర్వతదర్శనార్థం వెళ్లుతుంటాడు. దక్షిణ దేశయాత్ర ముగించి ఉత్తరదేశంలోని కాశీ విశ్వేశ్వరుని సందర్శించి, ఐదుక్రోసుల దూరం వెళ్లాక, భయంకరారణ్యంలో పయనిస్తూ, దప్పిగొని ఎదుట సరస్సును చూసి' సంతోషాంతరంగుడై, ఆ సరస్సు పక్కనేఉన్న వటవృక్షాన్ని చూస్తాడు.

'తన పలాశశ్రేణి ధరకంతటికిఁ బచ్చ
 పట్టుఁబుట్టంపు మేల్కట్టు గాఁగఁ,
తనయూర్ధ్వ శాఖావితానంబు సురలకు
 మరకతరమ్య హర్మ్యములు గాఁగఁ
తన వ్రేలుఁ గొమ్మలు మునులకుఁ గల్పిత
 పర్ణశాలాకలాపములు గాఁగఁ,
తనదిశాంతభ్రాంత ఘన విటపచ్ఛాయ
 వలయాద్రిహారిణ శాద్వలము గాఁగ,
వాలఖిల్యమునీశ్వరావాసమైన
రోహణమురీతిఁ బితృముక్తిగేహమగుచుఁ
గయఁ బ్రసిద్ధివహించు నక్షయవటంబు
చందమున నున్న యొక మఱ్ఱిక్రింది కేగి'

(3-198) ఇందు ధూర్జటి వటవృక్షాన్ని ఎంతో మనోజ్ఞంగా వర్ణించాడు. చల్లటి ఆ వటవృక్షచ్ఛాయఁ గూర్చుండి, ఆ చెట్టునుంచి రాలిన పండుటాకులు సరస్సులోని నీళ్ళలో పడినవి చేపలుగాను, గట్టుపై పడ్డవి పక్షులుగాను, నయి అటు సగం ఇటు సంగపడ్డవి సగం చేప, సగం పక్షిరూపంపొంది లోపలికి బయటికి లాగుతూన్న చమత్కారం చూసి పరవశత్వం చెంది ఉంటాడు. అలా ఉండగా బ్రహ్మరాక్షసుడు కనిపిస్తాడు.

'క్రూరనిరీక్షణ ప్రభల
 గ్రుడ్డులు, కోఱలు, నూర్ధ్వకేశముల్,
నీరద నీలగాత్రమును,
 నిష్ఠురవాక్యము, లట్టహాసముల్,
ఘోరవకంఠ నిస్వనము
 భీకరహేతియు, మానవాస్థిహా
రావముల్ సెలంగ విక
 టాకృతిలో నొక భూత మాత నిన్.

(32-200) పట్టుకొంటుంది. ఇలాగా కళ్ళకు గట్టినట్టు సహజరీతిని బ్రహ్మరాక్షసుని వర్ణన చేశాడు ధూర్జటి.

రాయలు వటవృక్ష వర్ణనకి శార్దూల వృత్తాన్ని గ్రహింపగా, ధూర్జటి సీస పద్యాన్ని స్వీకరించాడు. బ్రహ్మరాక్షస వర్ణనకి సీసంచాలక తేటగీతిని రాయలు గ్రహింపగా, ధూర్జటి మాత్రం ఒకే ఒక ఉత్పలమాల వృత్తాన్ని తీసుకొన్నాడు. వటవృక్షవర్ణన రాయల సహజమైన ఓజోగుణముతో సమన్వితమై ఉంది. ధూర్జటి సరళరీతిని వర్ణించాడు. రాయలది నారికేళపాకం కాగా, ధూర్జటిది ద్రాక్షాపాకం. బ్రహ్మరాక్షస వర్ణనలో రాయల పదప్రయోగదక్షత ప్రస్ఫుటం. కొంత అర్థకాఠిన్యమూ ఉన్నమాట వాస్తవమే. అయితే సాహిత్యం ఆలోచనామృతం కదా మరి? సదవగాహన చేసుకొంటే బ్రహ్మరాక్షసునిమూర్తి మనకళ్లకు కట్టి, రాయల ప్రయోగదక్షత స్పష్టమై, అమితానందాన్ని ప్రసాదిస్తుంది. అయినా ధూర్జటి సులభశైలిలోనే బ్రహ్మరాక్షసుని వర్ణించాడు. ఇలాగా వటవృక్ష బ్రహ్మరాక్షసుల వర్ణనలో తమ తమ ప్రత్యేకతల్ని రాయలు, ధూర్జటి ప్రకటించడం స్పష్టం. అవి రాయలు, ధూర్జటి-ఇద్దరి మహోన్నత వ్యక్తిత్వాన్ని సైతం సుస్పష్టం చేస్తూండడం మనం గమనించవచ్చు. వటవృక్షాలకు, వాటిననుసరించి ఉన్న బ్రహ్మరాక్షసులకుఁగలసంబంధం గూడా ఇందువల్ల వ్యక్తమవుతుంది. కథానుగుణంగా చేయబడ్డ ఈసహజవర్ణనలు సహృదయరంజకమై ఒప్పారు తున్నాయనడంలో అత్యుక్తి లేదు!

## ఆశాలోచనాలు

- కె. మోహనరావు, ఎం. ఏ.



మొన్నటి అనుభవాల
మృత్తికలో
నిన్నటి అనుభూతుల
కన్నీటిని
చిలకరించి
నేటి ఆలోచనల
అంకురాలలో
రేపటి ఆశల
చిగురుల
రెప రెపలకు
ఎదురుచూపులే
ఈ...జీవితం.

—...—

# 'రాయప్రోలు సుబ్బారావు - గుడిపాటి వెంకటచలం'

— శ్రీ నాగేశ్వరం శంకర్.

ఆధునిక సాహిత్యంలో వ్యక్తి స్వేచ్ఛను, వ్యక్తి శ్రేయస్సును, వ్యక్తి ఆత్మను, వ్యక్తి బాధనే ప్రత్యేకంగా తీసుకొని సాహిత్య సృష్టి చేసినవారు చాల తక్కువ. ప్రబంధకవిత్వం లోని అంగవర్ణనతగ్గి, స్త్రీని గౌరవభావంతో ఉదాత్త ఆశయంతో పూజించిన సాహిత్యం ప్రబంధకవిత్వం తరువాతనే. ఒక ప్రక్క స్త్రీని గౌరవభావంతో పూజిస్తున్న సమయంలోనే వేదాలనుండి, పురాణాలనుండి, మతగ్రంథాలనుండి, భారత, భాగవతాలనుండి స్త్రీ జీవితక్రమం ఎలావుందో ఆలోచించే విధంగాను, స్త్రీ నేటిసమాజంలో బానిస బ్రతుకుతో ఉన్న పరిస్థితి ఎలావచ్చిందో అనేసాహిత్యం మరొకప్రక్క వచ్చింది. ఒక్క మాటలో చెప్పాలంటే స్త్రీ యెడల పూజ్యభావంతో, ఆరాధనభావంతో ఒక ప్రక్క సాహిత్యసృష్టి జరిగితే స్త్రీకి స్వేచ్ఛకావాలి, పురుషునితో సమానమైన సాంఘిక, ఆర్థిక, రాజకీయరంగాలలో ఇద్దరూ ఒక్కరే అనే భావచైతన్య సాహితీసృష్టి మరొకప్రక్క జరిగింది. ఆ సాహిత్యసృష్టికర్తలు రాయప్రోలు సుబ్బారావు, గుడిపాటి వెంకటచలం.

రాయప్రోలు అమలిన శృంగారసిద్ధాంతం ప్రతిపాదిస్తే, చలం "ఫ్రీలౌసొసైటీ" అనేసిద్ధాంతం ప్రతిపాదించాడు. రాయప్రోలు కలం ఖండ కావ్య ప్రక్రియను చేపట్టింది. రాయప్రోలు రచనలోను, ఆత్మార్పణలోను, అమలినత్వంలోను సిద్ధాంతం ప్రచారం చేస్తే, గుడిపాటి ఎక్స్‌ప్రెషన్‌తోనూ, స్త్రీల సమస్యలలోను, వివాహవ్యవస్థలోని లోపాలఎత్తిపొడుపులోనూ గొప్పగా రచించాడు.

రాయప్రోలుకు 'తృణకంకణం' ప్రధానం. చలానికి 'మైదానం, 'ఓ పువ్వు పూసింది' ప్రధానం. రాయప్రోలు స్త్రీ పాత్రలు విధిగీచిన గీటులోనుండి బయటకు రావు. సంప్రదాయాన్ని, వివాహ వ్యవస్థను గౌరవిస్తూ పవిత్రంగా ఆరాధిస్తాయి. చలంగారి స్త్రీ పాత్రలు విధిని ఎదిరించాలని బయటకుపోవడానికి ప్రయత్నిస్తాయి. సంప్రదాయాన్ని, వివాహవ్యవస్థను తమ స్వేచ్ఛకొఱకు ధిక్కరిస్తాయి. అనురాగం లేనిభర్తకన్న, ప్రేమించిన ప్రియునివైపు మొగ్గు జూపుతాయి. భర్తదగ్గర తృప్తి పొందనప్పుడు భర్త అనారోగ్యవంతుడైనప్పుడు, తల్లిదండ్రులబలవంతంపై పెళ్ళి చేసుకున్నప్పుడు వీరిపాత్రలువిముక్తి పొందడానికి సమాజాన్ని వొదిలి ప్రకృతి హృదయంలోకి తమ ఆత్మలను సంలీనం చేసుకునేందుకు ప్రయత్నిస్తాయి.

రాయప్రోలుకు కష్టకమల, స్నేహలత, స్వప్నకుమారము, రమ్యాలోకము, మాధురీ దర్శనము మొదలైన పుస్తకాల కన్న 'తృణకంకణము' గొప్పపేరు తెచ్చిపెట్టింది. చలంగారికి అమీనా, బ్రాహ్మణీకం, వివాహం, దైవమిచ్చిన భార్య, అరుణ, శశిరేఖలకన్న 'మైదానం, స్త్రీ' పుస్తకాలు గొప్పపేరు తెచ్చిపెట్టినాయి.

రాయప్రోలు హృదయవాదం ప్రచారం చేస్తే, చలం వ్యక్తివాదం ప్రచారం చేసాడు. రాయప్రోలు కావ్యప్రక్రియలో ఖండకావ్య ప్రక్రియలో ముఖ్యంగా 'మంగళా దీని మంగళ మధ్యాని, మంగళాంతానిచ కావ్యాని ప్రథంతే' అనే అభియుక్తోక్తిని నిరసిస్తే, చలం నవలా ప్రక్రియలోనూ, కథానికా ప్రక్రియలోనూ నవ్య ఆలోచనలు ప్రవేశపెడుతు కథ ఎత్తుగడలోనూ, ముగింపులోనూ, శైలిలోనూ, సంభాషణలోనూ నవ్యత సాధించాడు. రాయప్రోలు సంస్కార విరహం ప్రచారం చేసాడు. వీరి పాత్రలు విరహవేదనలోనే సుఖం దాగి వున్నట్లు తలచుకుంటూ వుంటాయి. ఒక స్త్రీని ప్రేమించి పరిస్థితుల వలన ఆమె లభ్యం కాక పోతే జీవితాంతం ఆమె కొరకు జపిస్తూ శరీరాన్ని వదలుకుంటాయి. చలంగారి స్త్రీ పాత్రలు పరిస్థితులప్రభావంతో, తల్లిదండ్రుల బలవంతంతో పెళ్లి చేసుకున్నపుడు భర్తనుండి ఎట్టి సంతోషం పొందనప్పుడు భర్త అనారోగ్యవంతుడైనపుడు తాను మొదట ప్రేమించిన ప్రియుడితో జీవితాన్ని గడపప్రయత్నిస్తాయి. ఒక పురుషుడికి సెక్స్‌వల్ ఫ్రీడమ్ ఎంతగావుందో అంతే స్త్రీకి కావాలంటాడు. రాయప్రోలు పాత్రలు విరహంతో బాధపడుతూ చివరికి ఒకరినొకరు చూసుకుంటూ, కన్నీళ్ళ విషాదంలో కలిసి పోతాయి.

చలందగ్గరికివస్తే, స్త్రీని ఈనాటి వివాహవ్యవస్థ తినడం, కనడం స్థితిలోనే వుంచింది. కుక్కకు యజమాని యెంత అవసరమో స్త్రీకి భర్త అంత అవసరం అనేది సమాజంలో పోవాలి. వివాహ వ్యవస్థను తిడుతూనే ఈనాటి స్త్రీకి వ్యవస్థలో లోపాల్ని ఎత్తిపొడిచి చూపించాడు. స్త్రీ ఎలా బలి అవుతుందో హృదయానికి హత్తుకునే విధంగా చెప్పాడు.

రాయప్రోలు స్త్రీని ఆరాధనాదృష్టితో చూసి, తరువాత భావకవులపై ప్రభావం చూపి భావకవిత్వానికి ఆద్యుడయినాడు. చలం స్త్రీ కొరకు తన జీవితాన్నే ధారపోసాడు. స్త్రీల కన్నీళ్లలో తన దోసెడు కన్నీళ్ళు కలిపాడు. జాలిపడ్డాడు. ఆ స్త్రీ పాత్రలను ఈ నాటి సమాజంపై, సంప్రదాయంపై వివాహ వ్యవస్థపై తిరగబడడానికి సన్నద్ధురాళ్ళను చేశాడు. మొత్తంమీద రాయప్రోలు భావకవిత్వానికి యుగకర్త అయితే, చలం 'ఫ్రీలౌసొసైటీ'కి యుగకర్త అయినాడు.

—...—

# ఆరుద్ర చిత్రించిన మధ్యతరగతి జీవితం

— శ్రీ సుంకిరెడ్డి నారాయణరెడ్డి.

'Poetry is an interpretation of life' అంటాడు అరిస్టాటిల్. ఇది ఆరుద్రకవిత్వంనిండా ప్రవహిస్తుంది. ఈ జీవిత ప్రవాహ చిత్రణలో ఒక పాయగా మధ్యతరగతి జీవితచిత్రణకూడ చేశాడుఆరుద్ర. ఆరుద్ర కవిత్వంలో జరిగిన మధ్యతరగతి జీవిత చిత్రణను పరిశీలించే ముందు మధ్యతరగతి అంటే ఎవరో తెలుసుకోవాలి. 'The middle class ocupying The central position between The extreems of The capitalists and The workers' ఈ నిర్వచనం మధ్యతరగతి అంటే ఎవరో వాళ్ళస్థితి ఏమిటో తెలుపుతుంది. ఈ మధ్యతరగతి జీవితచిత్రణ ఆరుద్ర కవిత్వం పుస్తకాలన్నింట్లోనూ జరిగింది. ఇక పరిశీలద్దాం.

'మధ్యతరగతి గేస్తు
మంచి బందోబస్తు'

ఇది అంత్యప్రాసల చమక్కులతో వ్రాసిన కూనలమ్మ పదాల్లోనిది. కొంత మంది కవులు అంత్యప్రాసలు వేస్తే అతికినట్లుండక వేయాలని వేసినట్లుంటుంది కాని ఆరుద్ర అంత్యప్రాసలు అలాకాక భావాని కతికినట్లుగా ఉంటాయి. ఇక్కడ మధ్యతరగతి గృహస్థుని జాగ్రత్త గురించి చెబుతున్నాడు.

'బూర్జువాలు కార్మికులు కానివాళ్ళు మధ్యతరగతి అంటారు మార్క్సు ఏంగెల్సులు. అంటే చిన్నపరిశ్రమల యజమానులు, దుకాణదారులు, చేతిపనివాళ్ళు, పరిమిత భూమిగల రైతులు, గుమస్తాలు, డాక్టర్లు, లాయర్లు, బడిపంతుళ్లూ మొదలగు వారంతా ఇందులో చేరుతారు. కవులూ, మేధావులూ రచయితలూ ఇందులోనే చేరుతారు. కవులనుగురించి చెబుతూ

'తరానికో వందకవులు_తయారౌతా
రెప్పుడూ'
వందలోనూ వందలోనూ మిగలగలిగే
దొక్కడు (పైలాపచ్చీసు)

అంటాడు, లోన తపన లేకుండా నమిలి మింగేసిన కవిత్వంవ్రాస్తే ఎలా మిగులుతారు? అందులో నవ్యతగా సామాజికావసరాల కనుగుణంగా వ్రాసినవాడే మిగులుతాడు. ఈ వాక్యాల ద్వారా మేముగూడ కవుల మనిపించుకోవాలనే మనస్తత్వం బయటపడుతుంది.

ఆరుద్ర ఎక్కువగా గుమస్తాజీవితం గురించి చెప్పినాడు. వినండి

'పాపంకానేకాదు పుచ్చుకోక తప్పదు
కొద్దిగా లంచం
అప్పుడే నిండుతుంది గుమాస్తాగాళ్ళ
కోపూట కంచం
అప్పుడే గుబాళిస్తుంది ఉన్నతోద్యోగుల
జమిలి మంచం'
(ఇంటింటి పజ్యాలు)

ఇచ్చేవాళ్ళున్నంతసేపు పుచ్చుకునే వాళ్ళుంటారు. ఇక్కడ లంచంతీసుకునే గుమాస్తాల బండారం బయటపడటమే కాక తీసుకోందే గడవని పరిస్థితి తెలుస్తుంది. అంతేకాదు గుమస్తాల ద్వారా పైఆఫీసర్ డబ్బులాగే కక్కుర్తితనం కూడ కన్పిస్తుంది. ఇదే పుస్తకంలో 'పథేరీపాంచాలి' అన్నకవితలో గుమస్తాను లీవుపెట్టి వాళ్ళ బంధువులు తమ వూరికి రమ్మనడం, హెడ్ క్లార్కు త్వరగా సెలవు ఇవ్వకపోవడం, ఇచ్చినా ఇంకొక క్లర్కు వచ్చి రిలీవుచేస్తేతప్ప వెళ్ళలేక పోవడం, బంధువులు ఏవో వస్తువులు తెమ్మనడం (అవి తమ ఊళ్లో దొరికేవే) వానికొరకు అతను అప్పు చేయడం, ప్రయాణంలో కూడ ఆఫీసు ఫైళ్ళు చూడడం మొ॥ విధంగా గుమస్తా జీవిత చిత్రణ చేశాడు. ఇక్కడ గుమస్తా జీవితస్థితి ఏమిటో తెలుస్తుంది.

ఇక 'త్వమేవాహం'లో సంకేతాత్మకంగా జీవితాల్ని చిత్రించాడు. మధ్యతరగతి వాళ్ళకు నిమిషాలను, వాళ్ళ భావాలకు పెద్దముల్లును సంకేతాలుగా తీసుకున్నాడు. ఈవిషయం దాశరథికి వ్రాసిన ఉత్తరంలో తనే చెప్పుకున్నాడు.

తథాస్తు అన్న కవితలో మధ్యతరగతికి సంకేతంగా తుత్తునాగాన్ని తీసుకున్నాడు. రాగిని శ్రామికులకు, ఇనుమును పెట్టుబడి దార్లకు సంకేతంగా తీసుకున్నాడు. రాగి, తుత్తునాగం కలిస్తే ఇనుము అయస్కాంతంగా మారుతుంది, అంటే శ్రామికులు మధ్యతరగతి కలసి పోరాటం సాధిస్తే పెట్టుబడిదారీ వ్యవస్థ నశించి సమసమాజ వ్యవస్థ వస్తుందన్న మాట. మార్క్సు కూడ ఇదేఅంటాడు.

నిమిషాలు అన్నకవితలో మధ్యతరగతి స్వభావం, మనస్తత్వం జీవిత విధానం గురించి చిక్కగా చెప్పాడు ఈ కవిత మధ్యతరగతి వాళ్ళు తమను గురించి తాము చెప్పుకుంటున్నట్లు కవి వ్యాఖ్యానం చేస్తున్నట్లు వ్రాయబడింది. 'కృత్రిమ సమాజపు చట్టాలలో మేకు బందీ అయిపోయి గానుగెద్దులాగా బతుకుతారు వీళ్ళు. పొద్దున్నే బద్ధకంగా నిద్రలేచి తొందరగా అఫీసు ముఖాన్ని తగిలించుకొని ' అని కవి అన్నా

"సుప్రీం కవీశ్వరుడు
మాపాత్రలకి స్వగతాలు తప్ప
సంభాషణలు పెట్టలేదు.'

అని తమనుగురించి తామే చెప్పుకున్నా మధ్యతరగతిగానుగెద్దు జీవితమే కన్పిస్తుంది.

మాజీవితాలకల్లా
సారెగదిలోనిదె రొమాన్సు
'పెద్దదొరముందు
మాట్లాడడమే ఎడ్వెంచరు'

అనడంలో వాళ్ళ అధైర్యం, భార్యతో కూడ తృప్తిగా జీవించలేని ఇరుకు జీవితం తెలుస్తుంది.

'మీదుమెట్టువాళ్ళ ఎదురుగుండా కూర్చొనే తాహతులేక కిందిమెట్టువాళ్ళ భుజంతో భుజం కలుపలేక గబ్బిలాల్లాగా జీవిస్తారు. ఈ వాక్యాలు మధ్యతరగతి వాళ్ళని పట్టిస్తున్నాయి. మధ్యతరగతి వాళ్లు ఎంతసేపటికి పైతరగతికి చేరుకోవాలని ప్రయత్నిస్తారు. కాని పెట్టుబడిదారీ వ్యవస్థ అలా చేరనీయదు. కింది తరగతి వారితో కలుద్దామంటే మనసొప్పదు. దాంతో ఎటూచేరలేక మధ్యన ఊగిసలాడుతారు. కాని ఈ వ్యవస్థ క్రమంగా మధ్య తరగతిని క్రిందితరగతికే చేరుస్తుంది. ఇదంతా మన నిత్యజీవితంలో దర్శిస్తాం. అయితే కవి ఈమూడు మెట్లు నాశనమయి సమసమాజ స్థాపన కావాలని కోరుకుంటున్నాడు.

ఇక 'సినీవాలి' పూర్తిగా మధ్యతరగతి గుమస్తా కథాకావ్యం. కాలేజి నుండి నగరం ప్రవేశించి నగర వాతావరణం సరిపడక మళ్ళీ తనస్వగ్రామంపోయి తండ్రి బలవంతంతో వివాహానికి సిద్ధపడి ధనవంతుల అమ్మాయిలను కాక తనకు నచ్చిన అమ్మాయిని ఇష్టపడి తిరిగి పట్టణం చేరుకొని N.G.O. అవుతాడు సూర్యుడనే అబ్బాయి. కొన్నాళ్ల తర్వాత ఆ అమ్మాయిని పెళ్ళి చేసుకుంటాడు. ఇంకా కొద్దిరోజుల తర్వాత సంసారం బాధలు తట్టుకోలేక మృత్యువును కోరుకుంటాడు. ఇది ఇందలి ఇతివృత్తం చక్కని పదచిత్రాలతో కన్నులకు కట్టినట్లుగా వర్ణించాడు ఆరుద్ర. ఇందలి సూర్యుడు మొదటఆదర్శవాదిగా ఉంటాడు. సంసారం బాధలలో అన్నీపోతాయి. చివరికి దేవుణ్ణి కూడ నమ్ముతాడు. ఒకమధ్య తరగతి వ్యక్తి ఏవిధంగా మారుతాడో చక్కగా వర్ణించాడు.

—•••—

# కలియుగ భీముడు - కోడి రామ్మూర్తినాయుడు

— శ్రీ ఇ. టి. లోకనాథరావు, ఎం. ఏ.

శ్రీ కోడి రామ్మూర్తిగారు 1862 సంవత్సరములో పాలకొండ తాలూకా వీర ఘట్టాం గ్రామంలో పుట్టారు. వీరి తండ్రి వెంకన్న.

పదేళ్ల వయసు వచ్చేవరకు రామ్మూర్తిగారు వీర ఘట్టాంలోనే ఉన్నారు. ప్రపంచ చరిత్రలో పేరెన్నికగన్న వాళ్లలో ఉండే సామాన్య లక్షణం అల్లరి. వీరి చిన్నతనంలో అదిమెండు. మొండి కూడా. అంచేత వీరిని విజయనగరంలో సర్కిల్ ఇన్స్పెక్టరుగా పని చేస్తున్న కోడి నారాయణస్వామి దగ్గరకు పంపేరు. అప్పటికి రామ్మూర్తి గారి వయస్సు కాస్త అటూ ఇటూగా 12 సంవత్సరా లుంటుంది.

'తంతే బూర్లెగంపలో పడ్డట్టు' రామ్మూర్తిగారు విజయనగరంలో పడ్డారు. ఆ రోజుల్లో విజయనగరంమంచి చెడ్డల మేలుకలయిక వంటిది, అటురౌడీతనానికి ఇటు మేధా ప్రదర్శనకు పట్టుకొమ్మ. రామ్మూర్తిగారి సహజమైన ధైర్యానికి, ఉత్సాహానికి చక్కని ఆలంబనమైంది విజయనగరం. రామ్మూర్తిగారు అల్లరివాడు కాని కల్లరి మాత్రం కాడు. ఆ గుణమే ఆయన్ని అందల మెక్కించింది.

మహారాజా బ్రాంచి కాలేజిలో ప్రవేశించాడు. గొప్పవాడు కావలసినవాడు ఏదో ఒక రంగంలో ముందంజగానే ఉంటాడు. రామ్మూర్తిగారు చదువులో ఒకడుగు వెనకవున్నా తగవుల్లోఎప్పుడూ రెండడుగులు ముందే. లంకవీథి, గవరవీథి, నాగవంశపువీథి, దాసన్నపేట, సుంకరవీథి మున్నగువీధులు ఆ రోజుల్లో దెబ్బలాటలకు ఉనికి పట్టులు. రామ్మూర్తిగారికి దెబ్బలాట లంటే ప్రీతి. ప్రతి రోజూ ఏదో ఒక తగవుండేది. దెబ్బలాటంటే కొట్టడమూ ఉంటుంది. కాయడమూ ఉంటుంది. రంగంలో దూకేవారి: రెండూ సమానమే.

తగవులంటే ఎంత ఆసక్తో, కసరత్తు చేయడమంటే అంత దీక్ష. పుట్టుకతో వచ్చిన శారీరక బలం సాధనతో మరింత మెలికలు తిరిగింది. విజయనగరంలో గల అన్ని కసరత్తు బంగళాల్లోనూ వ్యాయామం చేసేవారు. దక్కను వీథి బంగాళాలో తరుచు ఉండేవారు. నివాసం మాత్రం బొండాడ వీథి. దండలు, బస్కీలు వేల సంఖ్యలో చేసేవారు. పేరలల్ బార్, రింగులు మొదలైన పాశ్చాత్య కసరత్తుల్ని కూడా అతి నిపుణతతో నాట్యంగా చేసేవారు. బెల్లం ఉన్నచోట చీమ లుండడం సహజం. ధైర్యం, బలం, తగవంటే ముందంజ వేసే లక్షణం కల రామ్మూర్తిగారి వెనకాల ఎప్పుడూ ఒక జట్టు కుర్రాళ్లు ఉండేవారు. ఎంత తగవుల మారైనా, తగిన కారణం లేనిదే కయ్యానికి కాలు దువ్వేవారు కారు. ఎవరైనా దువ్వితే మాత్రం దుంపతెంపేవారు. రోజులు గడిచాయి. కాని బుద్ధులు మారలేదు. మారె రోజు ముందరోనే ఉందని ఆనాడెరడూ

గుర్తించలేదు. చివరకు రామ్మూర్తిగారూ ఊహించలేదు.

ఒక తగువులో రామ్మూర్తిగారు ఒకర్ని రక్తాలొచ్చేటట్టు కొట్టారు. వాడు పోలీసు రిపోర్టిచ్చాడు. పోలీసులు రామ్మూర్తిగారిపై గాలింపు ప్రారంభించారు. రామ్మూర్తిగారు ఒక దేవాలయంలో దాక్కొన్నారు. అది ఆంజనేయులవారిది. ఆ గుడిలోనే సీతారాము బాబాజీ అనే ఒక సిద్ధు డుండేవాడు. విజనగరానికి 1 మైలు దూరంలో తోటపాలెం వెళ్ళే తోవలో ఉండే దాగుడి. శ్రీరామకృష్ణుల వారి పరిచయం కలగక మునుపు, వివేకానందుడూ సామాన్యుడే. బాబాజీగారు జరిగిందంతా రామ్మూర్తిగారి ద్వారా విన్నారు. చిరునవ్వు నవ్వి వెన్ను తట్టి భయంలేదన్నారు. కొండంత బలం వచ్చింది రామ్మూర్తిగారికి. ఈ బాబాజీగారే రామ్మూర్తిగారికి ఆంజనేయ మంత్రోపదేశం చేసి, హఠయోగం నేర్పారని అంటారు. బాబాజీ సాహచర్యంలో రామ్మూర్తిగారు శారీరకబలంతో పాటు యోగ బలంకూడా సంపాదించారు. అగ్గికి ఆజ్యం తోడైంది.

ఈ సమయంలోనే తుని మహారాజు గారికి సర్కసు కంపెనీ పెట్టాలనే కోర్కె కలిగింది. క్రీడాకారుల్ని, ఆహ్వానిస్తూ ప్రకటన చేసారు. సీతారామ బాబాజీగారు రామ్మూర్తిగార్ని, వెళ్ళమని ఆశీర్వదించారు. రామ్మూర్తిగారు వెళ్లడం, తన విద్యను, బలాన్ని ప్రదర్శించడం జరిగినవి. అంతే ఆనాటినుండే రామ్మూర్తిగారు సర్కసు నిర్వాహకుడైపోయాడు. 1 ఏనుగ, 6 గుర్రాలు, 2 పులుల్తో 'సింగిల్ పోలు' సర్కసుప్రారంభించారు. ఈ సర్కసులో రామ్మూర్తి గారు ఆంధ్రప్రదేశ్ అంతా పర్యటించారు. ఎక్కడ సర్కసు వేసినా క్రిక్కిరిసిన జనం, ఊపిరాడని పొగడ్త. ఈ సర్కసులో పులుల్ని ఆడించే బాధ్యత రామ్మూర్తిగారిదే. అగ్రిటల్ బార్, రింగులు, ఉయ్యాలూగుట మున్నగు పనుల్ని విజయనగరం కంటుభుక్త వీథి యువకుడు 'హరి' అనే అతడు చేసేవాడు. ఏఊరు వెళ్లినా 'రామ్మూర్తి సర్కసు' అంటూ ప్రజలు ఉత్సాహం చూపెట్టడం తుని మహారాజు గారికి కన్నుకుట్టడం రెండూ ఒకేసారి జరిగాయి. రాజుగారి సర్కసని అనడం మానేసి రామ్మూర్తి గారి సర్కసు అనడం రాజుగారికి కష్టం కలిగించినా న్యాయమైనదే.

ఆంధ్రా అంతా తిరిగి 'తుని' చేరేటప్పటికి రాజుగారు సర్కసు వదలి రామ్మూర్తిగార్ని పొమ్మన్నారు. రామ్మూర్తిగారికి నవ్వు వచ్చింది; అంతకు మించిన కోపమూ కూడా వచ్చింది. రాజుల్తో వైరం సామాన్యుడికి మంచిది కాకపోయి నప్పటికి రామ్మూర్తిగారు వెనుకంజ వేయలేదు. ఎంచేతంటే అతడు సామాన్యుడు కాడు. యోగబలం, భుజబలం రెండూ మిళితమైన అద్వితీయుడు కాబట్టి. రాజుగారిని సవాల్ చేస్తూ టెంటులో సహా అన్ని వస్తువుల్ని, వస్తాదుల్ని వెంటబెట్టుకొని, 'దమ్ముంటే అడ్డగించ' మని సవాల్ చేస్తూ రామ్మూర్తి గారు జబర్దస్తీగా వెళ్ళిపోయారు. రాజుగారు మౌనం వహించారు. రామ్మూర్తి గారు విజయం ధరించారు. ఆనాటినుండే రామ్మూర్తిగారి స్వతంత్రమైన సర్కసుకు పునాది ఏర్పడింది.

రామ్మూర్తిగారి విజయయాత్ర ప్రారంభమైంది. తనశక్తిని మరియు తన దగ్గరఉన్న క్రీడాకారులు, వస్తాదుల శక్తిని కలిపి ప్రదర్శించేఅవకాశం కల్గింది. మందీమార్బలం కూర్చుకొని పెద్దసర్కసు ప్రారంభించారు. ఈ సర్కసే రామ్మూర్తిగారి వ్యక్తిత్వాన్ని ఇనుమడింప చేసి జాతీయస్థాయిలో అతని పేరు నిల్పింది. భారతదేశమంతా పర్యటించారు. విద్యను, వివేకాన్ని ప్రదర్శించి ప్రజల, రాజుల జేజేలందుకున్నారు. ఏ రాజాస్థానానికి పోయినా అఖండమైన స్వాగతం, అద్వితీయమైన బలప్రదర్శన. విచిత్రం యేమంటే రామ్మూర్తిగారు ఎన్నడూ స్వయంగా కుస్తీపట్టేవారు కాదు. ఎవరైనా సవాల్ చేస్తే శిష్యుల్తో పట్టించి, అవతలవాణ్ని చిత్తుచేయించేవారు. 'విశాఖపట్నం'లో 'రజక్' అనే వస్తాదు ఆయన్ని వికటంగా విమర్శించి కుస్తీపట్టడానికి సవాల్ చేసాడు. రామ్మూర్తిగారు నిగర్వి, సౌమ్యుడు. కాబట్టి చిరునవ్వునవ్వి తన శిష్యుడితో పట్టమన్నారు. పట్టాడు. పూర్తిగా ఓడిపోయి దాసోహమన్నాడు. జయపూర్, రాజస్థాన్, ఉదయపూర్, లక్ష్మీపురం, మైసూరు మున్నగు పెద్ద పెద్ద ఆస్థానాల్లో ప్రదర్శనలిచ్చి వారి వారి వస్తాదుల్ని ఓడింపజేసి రాజాదరణకు పాత్రులైనారు. యావద్భారతదేశంలో ప్రసిద్ధిగాంచిన 'ఘామా' వస్తాదు ఇతని శిష్యుడుగా ఇతనితో పాటే ఉండేవాడు. ఇతర మేటి వస్తాదుల్లో హిమమ్ భాయి, చతుర్భజ్, గమ్మ మల్లు బాబూరామ్, నారాయణసింగ్ బచ్చ మున్నగువారు ముఖ్యులు. ఒక్కొక్కరు ఒక్కొక్క మేరువు లాంటి వారు. కాని ప్రతి వస్తాదుకు రామ్మూర్తిగారంటే అభిమానంతోకూడిన గొప్పభయం. ఎంత బలవంతులైనా రామ్మూర్తిగారి ముందు సూర్యుని ముందు దివిటీలే.

రామ్మూర్తిగారు స్వయంగా చేసిన బలప్రదర్శనల్ని వింటే కాశీమజిలీ కథల్లో విషయాల్లా తోస్తాయి ఇప్పటి కుర్రకారుకి. కాని అవన్నీ నిజాలే. సాధ్యాలుకూడా. నిర్వీర్యత, నిస్సత్తువ మానసిక దౌర్బల్యం పెచ్చుపెరిగిపోయిన నేటి సంఘానికి అవన్నీ అద్భుతాలుగ,

అగమ్య గోచరాలుగ కన్పించవచ్చు. కారుల్లో రాజువంటిది. 'రోల్స్ రోయ్స్' కారు. అటువంటి రెండుకార్లను రెండు చేతుల్తో బంపర్లు పట్టుకొని ఆపేవారు. సుమారు రెండుటన్నుల బరువుగల నల్ల జనపరాయిని గుండెలపై పెట్టుకొని, సమ్మెట్లతో బద్దలు కొట్టించుకొనుట, 2 అంగుళాల దళసరిగల ఇనుప గొలుసును తెంపుట, సుమారు 3 అంగుళాల మందంగల బండి ఇరుసును డొంగలవేసి గుండెలపై ఏనుగును 10 నిముషాలపాటు నిలబెట్టుట, పెద్దత్రాసులో నిలబడి, 6 అడుగుల ఎత్తుగల బలిష్ఠమైన అరేబియా గుఱ్ఱం పదుముకు త్రాడును కట్టి పళ్ళతో పట్టుకొని 1½ అడుగుల ఎత్తు లేచేవరకు ఎత్తుట, మొదలగు అద్వితీయ బలప్రదర్శనల్ని చేసేవారు.

ఇంగ్లీషువాడు మాటలు నమ్మేరకం కాదు. స్వయంగా చూస్తేగాని ఏదీ నమ్మడు. నెల్లిమర్ల జ్యూటు మిల్లులో గల దొరలు ప్రత్యేకంగా రెండు కార్లను, సాగే స్వభావం గల ఇనుపగొలుసు చేయించారు. రామ్మూర్తిగారు రెండు కార్లనుఆపి, గొలుసును తెంపి విజయం సాధించారు. దొరలు తెల్ల మొగమేసారు. స్వదేశంలో పేరుగాంచి విదేశాలు వెళ్లారు. అక్కడ కూడా జేజేలు, విజయాలు తప్పలేదు. ఎక్కడకెడితేనేం వజ్రంవజ్రమే కదా. ఇంగ్లండు, స్పెయిన్, రోము, దేశాలు పర్యటించారు. స్పెయిన్‌లో బలిసిన ఎనుబోతుతో దెబ్బలాడి, చంపి పాశ్చాత్యుల్ని భయభ్రాంతుల్ని చేసారు. ఇంగ్లండు ప్రభువుజార్జిచే బంగారపు పతకం గైకొన్నారు. లండన్లో హెర్క్యులస్ అనే వానితో పోటీగా బలప్రదర్శనల్ని చేసి, 'భారతదేశీయులు, సామాన్యులు' కారనే భయాన్ని పుట్టించారు. బలప్రదర్శనచేసే భారతీయుడుగా ఆరోజుల్లో విదేశాలు పర్యటించిన వ్యక్తి రామ్మూర్తిగారొక్కరే.

బలవంతుణ్ని చూస్తే బలహీనులికి భయమైనను, మట్టుపెట్టడానికి మార్గాలు వెతుకుతూనే ఉంటారు. రామ్మూర్తిగారి పట్ల అది నిజంగా నిజం. యోగశక్తిపరులు కాబట్టి ప్రాణాపాయస్థితుల్ని ఎన్నోసార్లు తప్పించుకొన్నారు కాని; లేకపోతే అంత నిస్సందేహంగా హత మయ్యేవారే.

అన్నీ చెప్పలేకపోయినా, వారి శిష్యులు చెప్పిన ఒకటి, రెండు సంఘటనల్ని మాత్రం చెప్తాను. గుండెలపై బల్ల వేసుకొని ఏనుగు నెక్కించుకొనేవారు. ఉత్తర హిందూస్థానంలో ఒకానొకరు ఇచ్చిన బల్లలో ఒక పక్క చెక్క బలహీనమైనదిగా చేయించి ఇచ్చారు. ఏనుగు ఎక్కడం, బల్లవిరిగి ఏనుగకాలు దిగబడి రామ్మూర్తిగారి ప్రక్క ఎముక చిదకడం, ఆపరేషన్ చేయించుకోవడం జరిగింది. అలాగే రంగూన్ సయ్యద్, సోదరులనబడే గొప్ప హింసాత్మక వ్యక్తులు వాళ్ళకు ఫ్రీ ప్యాసు లివ్వలేదనే కసితో రామ్మూర్తిగార్ని విందుకు ఆహ్వానించారు. తీరావెళితే హత్యా ప్రయత్నాలు చేశారు. రామ్మూర్తిగారు మూడంతస్థుల మేడమీంచిదూకి తప్పించుకొన్నారు. ఇంకొకరు విషం తాగిస్తే, ప్రాణాయామం చేసి జీర్ణించుకొని, మూత్రం ద్వారా విసర్జించారు.

అంత బలశాలి ఎంతఆహారం తినేవారో అనెడి ఉత్సాహం మనకు కలిగించక మానదు. చపాతీ, మాంసం, కోడిగ్రుడ్లు, పళ్ళరసాలు ఎక్కువగా తినేవారు. అప్పుటప్పుడు పెరుగు అన్నం తినేవారు సాధారణంగా బలవంతుడు అందంగా ఉండడనే అపోహ లోకంలో ప్రచారంలోఉంది. కాని రామ్మూర్తిగారు అందగాడు. ఆరడుగుల మనిషి. కోరమీసాలు, తలకు పగిడీ లాంగుకోటు వేసి హృదయోల్లాసంగా ఉండేవారని శిష్యులు చెప్తుతుంటారు. బంగారపు చాయ. బలప్రదర్శన చేసిన తరువాత దొరసానులు అతని శరీరాన్ని ముద్దులతో ముంచెత్తేవారట. ఆడవాళ్ళకు ఏది వచ్చినా పట్టలేం కదా. విశ్వాన్ని అలరించేది ప్రేమ. దాన్నించి తప్పించుకోవడం ఎవరికి సాధ్యం? బలవంతుడైనా ప్రేమ ముందు బలహీనుడే. రామ్మూర్తి గారు అవివాహితుడు కాని బ్రహ్మచారి మాత్రం కాదు. ఆయన సర్కసులోనే పనిచేసే 'అప్పలనరసమ్మ' అనే ఆవిడ ఆయన ఇష్టురాలు.

సామాన్యుణ్ని అసాధ్యుడుగా చేసేది యోగాభ్యాసం. రామ్మూర్తిగారు హఠయోగాన్ని చేసేవారు. ప్రాణాయామం చెయ్యడంలో వారు సిద్ధహస్తులు. గాలిని గంటవరకు కుంభించేవారని, సూది గుచ్చినా చలించేవారు కారని వారి శిష్యులు చెపుతుంటారు. యోగాసనాలు వెయ్యడంలో, శిష్యులకు నేర్పడంలో వారు కడునేర్పరులు. సుమారు 80 ఆసనాలు వేసేవారట. రామ్మూర్తిగారు గొప్ప దైవభక్తి గలవారు ఆంజనేయోపాసకులు. ప్రతిరోజూ పూజచేసేవారట. రామ్మూర్తిగారు పూజచేసే సమయంలో గవర్నరు వచ్చినాలేచి వచ్చేవారు కారట. రాత్రి పూట ఒంటరిగానే గదిలో పడుకొనేవారట. ఏ శిష్యుడూ తలుపు తెరవడానికి భయపడేవారట. కాళ్ళపెద్ద అప్పన్న అనే శిష్యుడు ఒక రాత్రి తలుపు మెల్లగా తెరచి చూచేసరికి గురువుగారి తలదగ్గర పెద్దకోడి కూర్చుండడం కనపడి జ్వరం పెట్టుకొన్నానని చెప్పారు. ఆంజనేయుడు ఆయన పిలిస్తే పలికేవాడని శిష్యులు అంటుంటారు.

రామ్మూర్తిగారు గొప్ప దానశీలి. ఈ విషయం చాలా మందికి తెలియదు. తెలిసినా నమ్మరు. అందుకు కారణం ఆయన దానంచేసే దంతా గుప్తంగా చేసారు. ఆయన్ని అంటిపెట్టుకొని

ఉండే శిష్యులకు, స్నేహితులకే అది తెలుసు. ప్రథమ ప్రపంచయుద్ధ సమయంలో గవర్నమెంటువారికి 40,000/-లు విరాళం ఇచ్చేరంటే చెవులు నమ్మని మాటే. కాని ఇది అక్షరాలా నిజమని అప్పట్లో ఆయనదగ్గర ఉన్న శిష్యులే చెప్పారు. అన్నంలేదని, బట్టలేదని, ఇల్లులేదని ఎవరు వచ్చినా వివరా లడగకుండా విరాళంగా ఇచ్చేవారట. పెళ్ళిళ్ళకు, దేవాలయాలకు, కాలేజీలకు ముఖ్యంగా వస్తాదులకు ఆయన ఇచ్చిన విరాళాలు ఎక్కువ. ప్రత్యేకంగా విజయనగర ప్రజలన్నా, వస్తాదులన్నా అపరిమిత అనురాగం. విజయనగరంలో శ్రీ పైడితల్లి అమ్మవారి పండుగకు డబ్బు ముందుపెట్టుకొని కూర్చొనేవారట. ఉదయం నుండి సాయంత్రం వరకు వేషాల వాళ్లకు చేతికెంతవస్తే అంత ఇస్తూ ఆనందించేవారట. ఆఖరుకు వేల రూపాయలు విలువచేసే ఆయన మెడల్సు, కోటుకూడా అమ్మి విరాళాలిచ్చేరట. ఆయన మొత్తం చేసిన దానం కోటి రూపాయలు పైబడి ఉంటుందని ఆయన శిష్యులు, స్నేహితులు చెప్పారు. అట్లాంటప్పుడు రామ్మూర్తి గారు 'విశ్వదాత' అనే బిరుదుకు తప్పక పాత్రులు కాని ఆయనది గుప్త దానం. కనుకనే బిరుదూ లేదు. పొగడ్తాలేదు.

రామ్మూర్తి గారు ఎక్కువగా చదువుకోక పోయినా జీవితాన్ని, దేశాన్ని బాగా చదువుకొన్నారు. ఇంచుమించు భారతీయ భాషలన్నీ ఆయనకు మాట్లాడటం వచ్చేది. ఉపన్యాసం చక్కగా చెప్పేవారట. ఆయన ఉపన్యాసంలో ఇంగ్లీషు, హిందీ, ఒరియా, బెంగాలీ మున్నగు భాషలన్నీ మిళితమై ఉండేవని 1930 విజయనగరం శ్రీ మహారాజా కళాశాలలో ఇచ్చిన ఉపన్యాసాన్ని గూర్చి బహుముఖ ప్రజ్ఞాశాలి, శ్రీ కోణంకి అప్పలస్వామి గారు చెప్పేవారు. ఎంత బలవంతుడో అంత నిగర్వి. అంత సహనశీలి. ఏ శిష్యుణ్నీ ఎన్నడూ కోపగించుకొనే వారు కారట. 'తిన్ని రండిరా, తాపులు తిని రాకండి' అని శిష్యుల్ని హెచ్చరిస్తూ ఉండేవారట. 'బలమే జీవనం, బలహీనతే మరణం' అని వివేకానందుడు చెప్పిన మాటల్లా ఉండేవని శిష్యులు చెపుతుంటారు.

కవుల్లో శ్రీనాథుడికి, నియంతల్లో నెపోలియన్‌కి అవసానకాలం హాయిగా జరుగలేదు. వీళ్ళిద్దరికే కాదు. ప్రపంచ చరిత్రలో గొప్ప వాళ్ళనిపించుకొన్న వారందరికీ రమారమి అలానే జరిగింది. రామ్మూర్తి గారు అటువంటి దశనుండి తప్పించుకోలేక పోయారు. విధిని తలదన్నేవారు లేరుకదా. రామ్మూర్తి గారి కాలిమడంపై చిన్న కురుపు వేసింది. కోతిపుండు బ్రహ్మరాక్షసై కూర్చుంది. పర్యవసానంగా పిక్కల వరకూ కాలుతీసేయవలసి వచ్చింది. బొంబాయి ఆస్పత్రిలో ఆపరేషన్ చేశారు. కాని అత్యంత ఆశ్చర్యకరమైన విషయమేమంటే 'క్లోడోఫారం' పుచ్చుకోడానికి నిరాకరించారు. గాలిని కుంభించి, కాలును డాక్టరు చేతి కందిస్తూ తెగకోయించుకొన్న గొప్ప ధైర్యశాలి, యోగపురుడు. ఆయన కాల్ని తీసివేసినా ఊతకర్రను గాని, కర్రకాలును గాని ఉపయోగించడానికి అంగీకరించలేదు. ఎవరో ఒక శిష్యుని భుజంపై చేయి వేసి నడిచి వెళ్ళేవారు. అంత ఆత్మ విశ్వాసం గల మనిషి రామ్మూర్తి గారు.

కాలు పోయింది. దాంతో పాటు సర్కసూ పోయింది. తత్ఫలితంగా ఆర్థిక పరిస్థితి దెబ్బతింది. ఖర్చుకు అలవాటు పడిన చేయి కాస్త ఇరకాటంలో పడింది. మౌనిగా కూర్చోవడం ఇష్టంలేక నానా రాజ సందర్శనం చేయడం మొదలు పెట్టారు. ఏ ఆస్థానానికి పోయినా గొప్ప గౌరవం, ఆదరణ ఇవ్వడం మారలేదు. అది 1934 వ సంవత్సరం. ఒరిస్సా రాష్ట్రంలోని బలంగీరు ఆస్థానం. ఆరోజు భోగిపండుగ. రామ్మూర్తి గారు శరీరంలో కాస్త చికాకుగా ఉన్నట్లు అనిపించింది. రాత్రయింది. దగ్గర్లో ఉన్న కాళ్ల పెద్దప్పన్న (విజయనగరం, గవరవీథి) అనే శిష్యుణ్ని పిలిచి గదిలో పక్క పరవమన్నారు. కొంచెంసేపు తల పట్టమన్నారు. మరుచటిరోజు తాను లెగిచే వరకు శిష్యుల్ని లేపొద్దన్నారు. గదితలుపులు వేసి అంతా వెళ్ళిపోయారు. మరుచటిరోజు జనవరి 16 వ తేది సంక్రాంతి ఉదయం 7 గంటలైంది. రామ్మూర్తి గారు నిద్రనుండి లేవలేదు. చాలా ప్రొద్దుపోయిందని శిష్యులు లేపడానికి వెళ్లారు. రామ్మూర్తి గారు ప్రశాంతంగా గుండెల మీద చేతులు పెట్టుకొని ప్రాణం విడిచి ఉన్నారు. కాళ్ల పెద్దప్పన్న (విజయనగరం) (గవరవీథి) కొండలరావు (విజయనగరం) సూరి (విశాఖపట్నం) దగ్గర ఉన్నారు. నిమిషాలమీద రామ్మూర్తి గారి మరణవార్త దివాణానికి వెళ్లడం, బలంగీరు రాజావారు రాజలాంఛనాలతో పూర్ భాగ్‌లో దహనక్రియలు జరిపించడం జరిగాయి. కాళ్ల పెద్దప్పన్న తలకు అగ్గి పెట్టారు. అంతబలమైన మనిషి అరగంటలో భస్మమై పోవడం. ఆశ్చర్యమని అప్పన అన్నారు. యోగాభ్యాసం చేసేవారు అలానే కాలిపోతారని యోగు లంటారు.

ఆధ్యాత్మిక స్థాయిలో రామ్మూర్తి గారి ఆత్మ విశ్వాత్మలో కలిసి పోయింది. జార్జి మహారాజు గారిచ్చిన 'మెడల్' ఢిల్లీ పోయింది. మూడు రోజుల తరువాత

ఆయన బంధువు లొచ్చారు. మిగిలిన సామాన్లు, బ్యాంకులో ఉన్న పైకం పట్టుకొని వెళ్ళిపోయారు. ఎవర్నయితే మొదట్నుంచీ ఆప్యాయంగా చూసారో ఆశిష్యులే చివరకు భుజంకాసారు. ఋణం తీర్చారు. ఎవరి ప్రాణం ఎక్కడ ఎవరి చేతిలో పోవలసిందో ఎవరు చెప్పగలరు! చిన్న గ్రామంలో సామాన్య వ్యక్తిగా పుట్టి, అంతర్జాతీయ స్థాయిలో అఖండ కీర్తిని బలశాలిగా పొందారంటే రామ్మూర్తిగారి 'ఆత్మ విశ్వాసం' అకుంఠిత దీక్ష అందుకు కారణాలు. ఆశయం లేని వాడు శవంతో సమాన మని అందుకే అంటారు. రామ్మూర్తిగారు మరణించినా ఆయనకీర్తి చంద్రిక వెల్లి విరుస్తూనే ఉంది. కాకులు వేనకు వేలుండొచ్చు, కాని కోయిలలు కొద్దిగానే ఉంటాయి. అలాగే బాతులు బారులు తీర్చి ఉండొచ్చుకాని హంసలు తక్కువగానే ఉంటాయి. ఒక రంగంలో ఒక కాలానికి ఒకడే పుడతాడు. అందుకే ఒక భీముడు, ఒక వివేకానందుడు ఒక కోడిరామ్మూర్తి, అందరికీ అందల మెక్కాలనే ఉంటుంది, కాని అనుకొన్నదాన్ని దీక్షతో అందుకోగల్గేవారు కొద్దిమందే. అందులో రామ్మూర్తిగారు ఒకరు. ఆయన ఒక చైతన్యం.

—...—

♦ మతి ♦

అమలినంబైన శృంగార మవతరించె
నిరువదియవ శతాబ్దిని నింతకు మును
మనదు కైత శృంగారము మలినతరము
మున్నదని మతి యున్నదన్న నమ్మంగఁ దగునె?

# నిత్యవ్యవహారంలో కొన్ని వింత ప్రయోగాలు

— శ్రీ టి. యస్. ఆర్. ఆంజనేయులు

ఒక సంస్కృతపదంతో ఒక తెలుగు పదాన్ని కలిపి మధ్యను ప్రత్యయమేదీ లేకుండా సమాసంచేస్తే అది వ్యాకరణ రీత్యా తప్పు. వైరిసమాసం అనిపించుకొంటుంది. కాని జనవ్యవహారంలో విచిత్రంగా స్థిరపడిపోయిన కొన్ని వింత ప్రయోగాలను అలవాటులో పండితులు కూడా మాటల సందర్భంలో వాడుతూనే ఉంటారు. ఇటువంటి ప్రయోగాలు ఏర్పడటానికి సాధారణంగా సామ్యమే (Analogy) ముఖ్య కారణం. ఈ కారణంచేత సంస్కృత పదాలతో తెలుగు పదాలు కలిసిన కొన్ని దుష్ట సంధులు కూడా ఏర్పడి జనవ్యవహారంలో స్థిరపడి పోయాయి. ఒక శబ్ద రూపాన్ని గాని, ప్రత్యయాన్ని గాని చూచి ఇంకొకచోట అలాగే కల్పించటం సాధారణంగా మనం చూడవచ్చు, ఉదాహరణకు సంస్కృతంలోనే, అకారాంత శబ్దాలయొక్క రామేణ, రామైః వంటి రూపాలు తేన, తైః అనే సర్వనామ రూపాల సామ్యం వలన ఏర్పడినట్టివి. అలాగే ద్వాదశ అనే రూపం యొక్క సామ్యంచేత ఏకాదశ అనే రూప మేర్పడింది. అష్టాదశ అనే రూపం ఏర్పడటానికి కూడా ఇదే కారణం. అయితే అసలు ఏకదశ, అష్టదశ అనేవి తొలి రూపాలు. ఇలా వ్యవహారంలో రూఢమైపోయిన అష్టాదశవంటి రూపాలను స్థిరపరచటానికి వ్యాకరణ శాస్త్రంలో సూత్రాలను కూడా కల్పించవలసి వచ్చింది. అంతేకాక వాని అసలురూపాలైన ఏకదశ, అష్టదశ వంటి వానిని జనం ప్రయోగించటం మానివేశారు. మరచిపోయారు. సంస్కృతంతో కలిసి ఏర్పడిన కొన్ని తెలుగు ప్రయోగాల విషయంలో కూడ ఇంతే జరిగింది.

తెలుగులో కన్నులు - కండ్లు, కళ్లు, చన్నులు - చండ్లు, చళ్లు అనే ప్రయోగాల సామ్యాన్ని బట్టి పల్లు అనే దానికి పళ్ళు, పండ్లు అనే తప్పు రూపాలు కల్పించి అసలు రూపం పల్లు అనే దాన్ని వదిలేశారు, మరచిపోయారు. ఏభాషలోనైనా ఇటువంటి మార్పులు సహజం, తెలుగులోని కొన్ని వింత ప్రయోగాలను పరిశీలించుదాం.

సంస్కృత సమాసాలైన 'అనేక విధములు,' 'అనేక పర్యాయములు' వంటి పదాల సామ్యంతో తెలుగులో 'అనేక మార్లు,' 'అనేకసార్లు', 'అనేకమంది' వంటి తప్పు సమాసాలు ఏర్పడినాయి. సంస్కృతంలోని 'యావత్' అనే శబ్దంతో తప్పుగా అనునాసిక సంధి చేయగా 'యావన్మంది' అనే రూపం వచ్చింది. ఇది 'యావన్మాత్రము' అనే సక్రమమైన రూపం యొక్క సామ్యంచేత పుట్టి ఉంటుంది. అలాగే, దురభ్యాసము, దురాలోచన వంటి పదాల సామ్యంచేత తప్పు సంధితో ఏర్పడిన రూపాలే దురలవాటు, దుర్నడత అనేవి. నిర్దాక్షిణ్యం, నిర్దయ వంటి పదాలను బట్టి యేర్పడినట్టిది నిర్మొగమాటం అనే రూపం. సంస్కృత ఉపసర్గతో సైతం ఏర్పడిన ఇటువంటి రూపాలకు సామ్యమే కారణమనక తీరదు. గృహస్థుడు అనే పదసామ్యం వల్ల కాపురస్థుడు వంటి రూపాలు ఏర్పడినాయి. చివరకు ఈ సామ్యభావం వల్ల మనం కేవలసంస్కృత సమాసాలను సైతం మార్చివేసి ప్రయోగిస్తున్నాం, ఈ నాడు మనం వాడుతున్న కోటేశ్వరరావు అనే పదం అసలు కోటీశ్వర పదానికి చెందినది. కాని మహేశ్వరుడు, పర

మేశ్వరుడు అనే పదాల సామ్యంతో అది కోటేశ్వర అయిపోయింది.

నిద్రాలోలుడు అనే అర్థంలో నిద్రాంబోతు' అని వాడుకలో ఉన్న పదం దుష్టసంధి, వైరి సమాసాలతో కూడి ఉన్న వింతపదం. ఇలాంటి పదాలు వ్యాకరణరీత్యా ఎంత తప్పులైనా, నిత్య వ్యవహారంలో వాని వాడుక అనివార్యమైపోయింది. అతివాదము అనే దాని సామ్యంలో 'అతివాగుడు' అనేరూపం పుట్టి వాడుకలోకి వచ్చింది. అపవాదము, అపఖ్యాతి వంటి పదాల సామ్యంతో 'అపనమ్మకం' అనే పదం పుట్టింది. ఇటు వంటి రూపాలవలన భాషాప్రయోగంలో వ్యవహారంలో కొంత సౌలభ్యం కూడా కలుగుతుంది. అలాగేమూఢ విశ్వాసం అనే పదం ఆధారంగా'మూఢ నమ్మకం' ఏర్పడింది. శుద్ధసత్యం, శుద్ధఅబద్ధం వంటి పదాల సామ్యంతో 'శుద్ధతప్పు' ఏర్పడింది.మదమత్తత,భార్యాపుత్రులు, రాజమార్గం, ఏకధాటి అనేవాని పోలికతో మదపిచ్చి, భార్యాబిడ్డలు,రాజబాట, ఏకబిగి అనే తప్పు సమాసాలు ఏర్పడి ప్రచారంలోనికి వచ్చాయి. ఏకమొత్తం, ఏకత్రాటిపై అనే ప్రయోగాలు ఒకే మొత్తం, ఒకేత్రాటిపై అనే అర్థాలలో సంస్కృతంలోని 'ఏక' శబ్దంతో ఏర్పడిన వింతరూపాలు. 'ఏకరాశి' వంటి పదాల సామ్యంతో అవి ఏర్పడి ఉండవచ్చును. మధ్యతరహా, మధ్య తరగతి, బ్రహ్మరాత, బ్రహ్మదేవుడు అనే ప్రయోగాలు కూడా మధ్యేమార్గం, బ్రహ్మలిఖితం వంటి పదాల సామ్యం చేత ఏర్పడి ఉంటాయి. అయితే ఇక్కడ ఒకసంగతి గమనార్హం. సామ్య పదాలలో లేని అర్థంలో కూడ ఆ పదాల పోలికతో ఏర్పడిన పదాలు వాడబడుతున్నాయి. బ్రహ్మరాత అనే పదం బ్రహ్మలిఖితం అనే అర్థంలోనే కాక చెడ్డ వ్రాత, అర్థం కాని దస్తూరి అనే అర్థంలో కూడ వాడబడుతున్నది. అలాగే అధికమైన చెవుడు అనే అర్థంలో బ్రహ్మచెవుడు అనే పదం ప్రయోగింప బడుతున్నది.

అధిక అనే శబ్దాన్ని ఎన్నో సమాసాలలో సంస్కృతంలో ప్రయోగిస్తారు. అధిక మొత్తం, అధిక దిగుబడి అనే రూపాలు సంస్కృతంలోని అధిక లాభం, అధికఫలం వంటి పదాల సామ్యం చేత కల్పించబడినవి. సంస్కృతంలో పంచభూతాలు, పంచపాండవులు వంటి పదాల సామ్యంతో పంచరంగులు, పంచవన్నెలచిలక వంటి పదాలు ఏర్పడి ఉంటాయి. జగద్విజేత, జగత్పిత వంటి పదాల సామ్యంతో ఏర్పడినట్టి జగజ్జెట్టి, జగత్కిలాడి అనే పదాలు ఈనాడు వాడుకలో మనం వింటూనే ఉన్నాం. ఇలాంటి వైరి సమాసాలు, దుష్టసంధులతో కన్పించే ప్రయోగాలు తెలుగులో ఎన్నో వ్యవహారంలో ఉన్నాయి. తెలుగులో చేరిపోయిన అన్యభాషాపదాలను సైతం సంస్కృత పదాలతో ముడిపెట్టి తెలుగులో కలిపివేసి మనం వాడుకొంటున్నాం అనటానికి 'జగత్కిలాడి' వంటి పదాలు నిదర్శనం.

ఒకప్పుడు తెలుగులో మణిప్రవాళ శైలి కూడా ఉండేది.కాని అదిక్రమంగా వాడుకలోనుండి తొలగిపోయి కొన్ని వాక్యాల, పదాల ప్రయోగాలు మాత్రం మిగిలి పోయాయి. ఎవరికివారే యమునా తీరే వంటి ప్రయోగాలు అలాంటివే. అనేక శతాబ్దాలుగా సాగివస్తూ ఎన్నో మార్పు చేర్పులకు లోనౌతూ, మరెన్నో మెరుగులు దిద్దుకొంటున్న మన భాషలో పైని ఉదాహరింప బడిన ప్రయోగాలన్నీ వ్యాకరణ రీత్యా దుష్టాలైనప్పటికి అవసరమైనవి, అలంకార ప్రాయమైనవి కాగలవు.

—...--

## లీలాగోపాలము

- శ్రీ ఎం. హెచ్. వి. సుబ్బారావు

క్షీరమథన క్రియాశీలినౌటనె కదా
నవనీత హారుడైతి వవనిమీద
భుజగసంసర్గ విస్ఫూర్తి విడకెకదా
అలభుజంగుడ వైతి వెలమిమీర
గోరక్షణోద్ధార కృతినిశ్చయతనెకా
గోరక్షకుడ వైతి కువలయమున
నందకహస్త సంతతిమూర్తి తనెకదా
నందాత్మజుడవయినావు ధరణి
మారువేసాల నెన్నిట మధ్య పెట్ట
బూనివను దాగబోవయ్య పుణ్యరూప
పూజితంబైన యావిష్ణు పూర్వకథలు
వ్యర్థశ్రమ లేల నయ్య ఓ వాసుదేవ!

చిన్ననాడపుడు గాచిన యాలమందలు
పదహారు వేలుగా పరిణమించె
పిననాడు నీనవోర్చిన దుర్జన విషాద
భంజన మ్మెద నిల్చె భండనమున
శైశవక్రీడయా శకట సంహారమ్ము
కదనరంగాన నక్రూరకు వచ్చె
చిరుత కూకటినాడు చెట్టెక్కి దాచిన
వలువలు కొలువున పాలతికయ్యె
పూవు పుట్టగనే తావి పొందునట్టు
వేలెడంతప్పుడే నీగుణీల లాయె
భావిపరతత్త్వ సూచక భావితములు
రత్నమునుమూపటను దాచరాయి యానె.

యాదవవంశివో అలక్షాత్రవంశివో
మోహనవంశివీ వూహసేయ
నరశిక్షకుడవో కాకరి శిక్షకుడవో వా
నరశిక్షకుడ వౌద నారతమును
నగవాహనుడవో పన్నగవాహనుడవో ఎ
న్నగ మోహనుడ వెలనాగలకును
పల్లవరాజవో వల్లవీ ప్రియుడవో
చల్లని భూజ మీ వెల్లరకును
ఎన్ని పేరులదాగిన నేని గాని
నామరూపాదిరహితుని నాదుహృదయ
నిత్యవశవర్తివౌ నిన్ను నేనెఱుగనె
నన్ను తప్పించుకోలేవు నందతనయ.

—+—

# భారతము - దాంపత్య ధర్మ పరిణామము

— శ్రీ మోపిదేవి కృష్ణస్వామి, ఎం. ఏ.

ఆర్యధర్మ పరినిష్ఠితమైన వివాహమును చిత్రించుట మాత్రమే భారత ప్రయోజనము కాదు. పరలోకమున వివాహవ్యవస్థ నెలకొనుటలోని విశిష్టతను దాని యారంభావస్థలను చిత్రించుట కూడ భారతమున ఉన్నది. మానవుడు ప్రకృతి తనకు ప్రసాదించిన వివేకముతో దాంపత్య సౌఖ్యమును క్రమముగ ధర్మబద్ధముగ నెట్లు మలచుకొనినది భారతమున చక్కగ వివరింపబడినది.

పశుపక్ష్యాదులలో కామానుభవ సందర్భమున వావివరుస లుండవు. ఒక భార్యకు ఒకభర్త, ఒకభర్తకు ఒకభార్య యను నియమము కూడ నుండదు. ఋతుకాలమందు అవి స్వేచ్ఛగ సౌఖ్యమనుభవించుచుండును. తొలిదశలో నరులు కూడ పశుపక్ష్యాదులవలె స్వేచ్ఛగా ప్రవర్తించెడి వారు తమకు నచ్చిన వారితో ఋతుకాలమందు సౌఖ్యమనుభవించి సంతతిని పొందెడి వారు.

ఉతథ్యుడను మునికి మమత యను భార్య కలదు. ఆమె గర్భవతియై యుండగా బృహస్పతి అభ్యాగతుడై వచ్చి దేవరన్యాయమున మమతనుండి పుత్రుని పొందగోరినాడు. అంతలో మమతగర్భమున నున్న శిశువు 'ఇది అధర్మము' ని ఆక్రోశించినాడు. అనగా ఒకని సంతతి గర్భమున పెరుగుచుండగా మరియొకడు స్త్రీనుండి సంతతిని బడయకోరుట అధర్మమని నర్ణయింపబడిన దన్నమాట. ఈ ధర్మమును చేసిన శిశువే పుట్టి దీర్ఘతమసు డను పేరుతో పెరిగి పెద్దయైనాడు.

ఇట్లు కాలము నడచుచుండగా మరియొక సంఘటన జరిగినది. ఉద్దాలకుడను ముని భార్య ఋతుమతియై యుండగా ఒక వృద్ధబ్రాహ్మణుండు అతిథిగ వచ్చి పుత్రార్థియై ఆమెను కోరెను. అప్పుడు ఉద్దాలకుని కొడుకైన శ్వేతకేతుడు సాధ్వియైన తనతల్లిని వృద్ధబ్రాహ్మణుడు కామించుట కిష్టపడక 'ఇది మొదలు స్త్రీలు పరపురుషులచే కోరబడుటకు వీలులేదు, పరపురుష సంగమము వలన సకల పాతకములు గలుగును, వివాహితలైన స్త్రీలకు నేనిట్టి హద్దు నేర్పరచుచున్నాను.' అని వైవాహిక జీవితమును ధర్మబద్ధము చేసినాడు. అప్పటినుండి ఈధర్మము మానవజాతికి శిరోధార్యమై అనుష్ఠింపబడుచున్నది.

అటులనే వైవాహిక జీవితమును పవిత్రముగ నడపుకొనిన వారి సంతతికి ఎట్టి తేజస్సు లభించునో మరియొక గాథలో చూపబడినది. భృగుని భార్య పులోమ గర్భవతియైన పులోమను అగ్నిహోత్రమునకై అగ్నులను విహరింపుమని చెప్పి భృగుడు స్నానార్థమై నదికి పోయెను. అంతలో పులోముడను రాక్షసుడు అగ్నిహోత్రుని సమీపించి పులోమను చూచి యున్మత్తుడై 'ఎవ్వరీ సతి' యని అగ్నిహోత్రుని ప్రశ్నించెను. అనృత'మాడుటకు వెరచిన అగ్ని 'ఈమె భృగునిపత్ని' అని చెప్పెను. అప్పుడు పులోముడు 'ఈమెను ముందుగా నేను ప్రేమించితిని. తరువాత ఈమెకు భృగునితో పెండ్లి జరిగినది.' అనుచు వరాహరూపము దాల్చి ఆసాధ్వీమణి నెత్తుకొని పరువెత్త సాగెను. జరుగుచున్న ఘోరమును గమనించుచున్న గర్భస్థ శిశువు రాక్షసునిపై కోపించి గర్భమునుండి వెలువడెను. అట్లు వెలువడిన అచ్యవనుని తేజస్సు సహస్ర సూర్యులు ఒక్కసారిగ ఉదయించిన దర్శనమిచ్చు తేజమును, ప్రళయ కాలమున భీకరముగ విజృంభించు అగ్నిహోత్రుని రూపమును తలపించెను. ఆ తేజమును చూచుచునే పులోముడు బూడిద కుప్పగ మారిపోయెను. మహాసాధ్వియైన పులోమ చ్యవను నెత్తుకొని ఆశ్రమమునకు భద్రముగ చేరుకొనెను. పవిత్రమైన వైవాహిక జీవితమునకు ఫలమైన సంతతి కెట్టి శక్తి యుండునో, అట్టి దంపతులకు నెట్టి రక్షణయుండునో, వారిశీలము వారి నెట్లు కాపాడుచుండునో ఈ గాథయందు నిరూపింప బడినది. ఇట్టి దివ్యత్వమును గమనించియే మానవులు తమ వైవాహిక జీవితమును క్రమముగ పవిత్రీకరించుకొనుచు వచ్చిరని భారతము సూచించుచున్నది.

మానవులకు యౌవనారంభమునుండి కలుగు భావ పరంపరలను సుకుమారముగ వర్ణించిన కావ్యము లుండవచ్చును. అంతటితో నాగరక తెరచాటు తొలగించి మోటుగ వర్ణించి తృప్తిపడే రెండవ తరగతి కవుల రచన లుండవచ్చును. ఇంకను బహిర్గతము చేయగలిగితి మని గర్వించు 'సెక్స్' రచయితల నీచ గ్రంథము లుండవచ్చును. కాని మానవ పరిణామము, అందలి వైవాహిక వ్యవస్థ రూపు కట్టుకొనిన తీరుతెన్నులు, క్రముగా ఏకపత్నీ వ్రతము, పాతివ్రత్యము నెలకొనినవిధము, మానవునకు వానినిర్వహణమున కావలసిన సమన్వయము భారతము నందు వలె మఱే యే గ్రంథమునను ప్రస్ఫుటము చేయబడలేదని నిస్సంకోచముగ చెప్పవచ్చును. అందువలననే భారతము ఏ ఆశ్రయమును కోరకయే ఇప్పటికి ఐదువేల సంవత్సరములనుండి మానవజాతిచే నారాధింపబడుచు మానవులకు మార్గ నిర్దేశము చేయుచున్నది.

ఈ వ్యాసము డాక్టరు చిలుకూరి సుబ్రహ్మణ్య శాస్త్రిగారి దర్శకత్వంలో నేను చేయుచున్న పరిశోధనమునకు సంబంధించినది. పరిశోధనాంశము. భారతము - ధర్మాద్వైతస్థితి. వారికి నా కృతజ్ఞతలు.

—...—

# కవిరాక్షసీయం

— శ్రీ సాంబయ్య పరిమి, ఎం. ఏ.

'కవిరాక్షసీయం' సంస్కృత కావ్యము. కర్త కవిరాక్షసుడు. ఇది 105 అనుష్టుప్ శ్లోకముల కావ్యము. 1875 లో సరస్వతీ నిలయ ముద్రాక్షరశాల వారిచే ముద్రాపితము. మరల తెలుగులో రెండవ ముద్రణకు ఈ కావ్యము నోచుకున్నట్లుగా లేదు.

తెలుగు సాహిత్యమున కవిరాక్షసులు గలరు. 1 అప్పకవి 'దక్షవాటి కవిరాక్షసుఁ డీ నియమంబు చేసిన' అని పేర్కొన్న కవిరాక్షసుడు వేములవాడ భీమకవి అని కొన్ని కథలవలన తెలియుచున్నది. 2. కందుకూరి వారు పదవసంపుట మున (ఆంధ్ర కవుల చరిత్ర. ప్రథమభాగము) (పుట 604) కవిరాక్షసుని 'ఆది నారాయణ చరిత్ర'లోని ఒక పద్యమును ఒకానొక పూర్వలక్షణ గ్రంథములోని దని ఉటంకించిరి. 3 కస్తూరి రంగకవి ఆనంద రంగరాట్ఛందమున కవిరాక్షసుని రాక్షసచ్ఛందమును ఉదాహరించినాడు. 4 దేవకీనందనశతకమును 'కవిరక్షశ్రేష్ఠుడు' రంచించినట్లుగ ఆ శతకము నందలి చివరిపద్యము తెల్పుచున్నది.

ఈ నాలుగు సందర్భములలో ప్రస్తావింపబడిన కవిరాక్షసుడు ఒక్కడో లేక వేరో తెలియుట లేదు. దేవకీ నందన శతకమును వెన్నెలకంటి జన్నమంత్రి కావించినట్లు జక్కన విక్రమార్క చరిత్రయందు తెలిపినాడు. (1-14 పద్యము). ఆధునిక విమర్శకులు, కవిరక్షశ్రేష్ఠుడే కవిరాక్షసుఁ డనియు, ఇతడే దేవకీ నందనశతకమును రచించినచో జన్నమంత్రి దేవకీనందన శతకమును రచించినట్లు జక్కన ఎట్లు తెలుపుననియు' పరమ హృద్యంబైన పద్యశతంబున దేవకీతనయు విధేయుఁ జేసె' (1-44)అను పద్యపాదమును ప్రమాణముగ తీసుకొని దేవకీనందనశతకమును వెన్నెలకంటి జన్నమంత్రి కావించెనని, ఈతడు క్రీ. శ. 1372 ప్రాంతమువా డని సిద్ధాంతమును చేసిరి.

పై నల్గురేకాక 'కవిరాక్ష సీయ'మును వ్రాసిన మరియొక కవిరాక్షసుడు ప్రస్తుతము తెలియవచ్చుచున్నాడు. ఈ సంస్కృత కవిరాక్షసుని కావ్యము తప్ప ఇతర కవిరాక్షస నామధేయుల కావ్యములు లభించుటలేదు. దేవకీనందన శతక కర్తృత్వము అనుమానాస్పదము. అందలి 'కవిరక్షశ్రేష్ఠుడు' కవిరాక్షసుడు ఒక్కరా! అనునది తేలని విషయము.

శ్రీ కృష్ణమాచారిగారు The History of Sanskrit Literature లో కవిరాక్షసీయమును చిత్రకావ్యములలో ఉట్టంకించి ఈక్రిందివిధముగ తెల్పినారు.

"348.Kavi Rakshasiyam is a poem of 100 verses involved meaning by an unknown author calling himself 'KaviRakshasa'. There are commentaries on it by Naganarya, son of Devanaradhya and two anonymous"

'కవిరాక్షసీయ'మే కాకుండ 'రాక్షసకావ్య' మని మరియొకటి సంస్కృతమున గలదు. ఇది 20 శ్లోకముల కావ్యము. భారతీయ విద్యాభవన్ వారు 1958 సం॥న ప్రచురించిన "Studies in Indian Literary History" Vol. I లో

'The Government Oriental MSS Library Madras, Contains some MSS of a poem having the designation कविराक्षसीयं. A description of MSS has been given in vol xx. (Kavya) of the Discriptive Catalogue of the Library (1918). I am unable to determine if there is any connection between राक्षसकाव्य and कविराक्षसीयं both of which are represented by some MSS in the several MSS Catalogues" Page 199 - అని కలదు.

మద్రాసు ఓరియంటల్ లైబ్రరీ వారి క్యాటలాగులో కవి రాక్షసీయ' ప్రతులు 6గల వని, అందు No: 12003 ప్రతి కవిరాక్షసీయమునకు శిష్టార్థదీపిక అను వ్యాఖ్యానమును నాగనార్యుడు వ్రాసినట్లు, అది కన్నడ లిపియందున్నట్లు కలదు.

కవిరాక్షసీయమునకు సంస్కృత సాహిత్య చరిత్రలందు కాలనిర్ణయము జరుగలేదు. దేవకీనందన శతకమునగల కవిరక్షశ్రేష్ఠుడు,కవిరాక్షసుడు ఒక్కడే అని ఊహింపవచ్చును. క్రీ. శ. 1420 ప్రాంతమునకు చెందిన జక్కన విక్రమార్క చరిత్రమున-

'కర్ణామృతకవీంద్రుఁ గామందకుఁ గలిగు గవిరాక్షసుని భాసుఁ, గాళిదాసు - (1-11 పద్యం)అని సంస్కృత కవులలో కవిరాక్షసుని చేర్చి స్మరించుటచే కవిరాక్షసుడు క్రీ. శ 1420 కాలమునకు (జక్కనకు) పూర్వుడని చెప్పవచ్చును.

వెన్నెలకంటి జన్నమంత్రి క్రీ. శ. 1372) కృతదేవకీనందన శతకమున ప్రస్తావింపబడిన కవిరాక్షసుడు, జన్నమంత్రికి సమకాలీను డని భావించినచో కవిరాక్ష

సుడు సుమారు క్రీ. శ. 1350-1400 ప్రాంతమువాడని ఊహింపవచ్చును.

కవిరాక్షసుడు తన కావ్యాంతమునందు–

'సాక్షరేషు భవతీహ జగత్యాం
సర్వ ఏవ హృదిమత్సరయుక్తః।
సాక్షరం కవిజనేషు య దేనం
లోక ఏవ కవిరాక్షస మాహ'

అని చెప్పుకొనినాడు. ఈ కావ్యములోని ప్రతిశ్లోకము గూఢార్థమయము. శ్లోకములన్నియూ ముక్తకములు. హితార్థకములు. కొన్ని కావ్యలక్షణములను ప్రతిపాదించునవి. ఇది కావ్యమగుటచే భారతీయ సంప్రదాయమున కనుగుణముగ మంగళము ఇందు ఆదిమధ్యాంతములందును గలదు. కావ్యారంభమున–

గుణదోషౌ బుధో గృహ్ణ
న్నిందుక్ష్వేళా వివేశ్వరః।
శిరసా శ్లాఘతే పూర్వం
పరం కంఠే నియచ్ఛతి॥'

అని కలదు.

ఈశ్వరుడు ఇందుక్ష్వేళ (విషము) లను గ్రహించినట్లు, బుధులు గుణదోషములను గ్రహించి గుణములను శిరసా శ్లాఘింపుడని, దోషములను కంఠమునుండి దొరలనీయకుఁడని బుధులను ప్రార్థించుట ఇందలి ధ్వని. పాఠకుడైన వాడు కావ్యము నందలి మంచిని గ్రహించి దోషమును విడువవలెనని అర్థాంతరము. ఈవిధముగ మంగళకరుడైన శివునిస్వరూపమును కావ్యవిమర్శకు ఉపమానముగ గ్రహించి కావ్యారంభమును చేసెను.

శబ్దశక్త్యైవ పర్యాప్తా
సర్వదానవ నిర్వృతిం
కావ్యవిద్యా శ్రుతి గతా
ప్యాప్నుమృతస్యాపి జీవనీ॥

శబ్దశక్తిచే అనగా వివక్షితార్థాభిధాయకత్వమున ఎల్లపుడు నూత్నానందమును కల్గించుకావ్యవిద్య చెవిని పడినంతనే మూర్ఖులైన వారికి ఆనందము కల్గును. (రసికుల గూర్చి చెప్ప నక్కర లేదు గదా!). మరియొక అర్థము–

ఉచ్చారణ దక్షునిచే సంజీవనీ విద్య (కావ్య విద్య) చెవులపడిన వెంటనే మృతులైన రాక్షసులను పునరుజ్జీవితుల చేయు జీవయిత్రి అయినది.

కావ్యము సంజీవనీ విద్యవలె నుండవలెనని సర్వదానవ నిర్వృతిని కల్గింపవలెనని కావ్యలక్షణమును ధ్వనింపజేయుచున్నాడు.

నన్నయ ఆదిపర్వ తృతీయాశ్వాసమున

విగత జీవుఁడై యున్న వేదమూర్తి
అతని చేత సంజీవితుఁడై వెలింగ
దనుజమంత్రి యుచ్చారణ దక్షుచేత
నతిభిహితంబగు శబ్దంబునట్ల పోలె
127 పద్య.

అని వ్రాసిన పద్యములోని ఉత్తరార్థము ఈ శ్లోకమునకు మూలమై ఉండవచ్చును.

మహాంత్స ఏవపురుషో
యస్యసత్యాను రోధినః।
ఆక్షిప్త పారిజాతేన
బాహునా రక్ష్యతేజగత్॥ 102

యథార్థభావనకు సత్యము అనుకూలముగా నుండ సాయపడును. ధర్మమున కవఘాతమును కల్గించు దుర్జనుల నుండి ఆ మానవుని ఎవ్వడు తన బాహుబలముచే రక్షించునో అతడే మహాపురుషుడగు శ్రీ మహావిష్ణువు. మఱియొక అర్థము–ప్రణయ కుపితయైన సత్యభామను ప్రియవచనముల ననుసరించు వాసుదేవుని యొక్క పారిజాతోన్మూలక బాహువులు జగత్తును రక్షించుచున్నవి

ఈ విధముగ ధర్మప్రతిష్ఠాపనార్థము అవతరించిన వాసుదేవుని స్మరణచే కావ్యము మంగళాంతమైనది.

—•••—

# నేనుకాక మరో నలుగురు

శ్రీ కర్రా కార్తికేయశర్మ.

ఆకాశాన అర్ధచంద్రుడు
అరనవ్వులు నవ్వుతున్నాడు
అతడి చుట్టూ మూగిన నక్షత్రాలు
ధనవంతుకు చితికి పోయినా
వదలని ఆడంబరాల్లా ఉన్నాయి.

నాచుట్టూ నవ్వుతున్న ప్రకృతి
క్రీనీడలో విటుల్ని పిలుస్తున్న
వేశ్యలా కనిపిస్తోంది.

చెట్లు తలలు వంచుకొని నిశ్శబ్దంగా
మరో లోకపు సందేశాలు వింటున్నాయి
వాటి కొమ్మలపై నిద్రపోతున్న మొగ్గలు
రేపు చూడబోయే లోకాన్ని గూర్చి
రంగురంగుల కలలు కంటున్నాయి
వాడిపోయి రాలిన పువ్వులు
కోరికలు తీరక ముందే చనిపోయిన
వృద్ధకన్యల్లా వెలవెల పోతున్నాయి.
అందరూ నిద్రపోయినా నిద్రలేనిగుడ్ల
గూబలు
పాలకోసం అర్ధరాత్రి ఏడ్చే
పసిపిల్లల్లా అరుస్తున్నాయి.

పూర్ణచంద్రునకు కొంచెంభయపడేచీకటి,
అర్ధచంద్రుణ్ణి అపహాస్యం చేస్తూ
లోకాన్ని ఆక్రమించు కొంది.
ఆ చీకటిని దుప్పటిగా కప్పుకుని
గురకలు పెడుతోంది లోకం
మూసుకున్న కళ్ళతో వాకిళ్ళు
సూర్యుడొస్తే కాని నిద్రలేవ నంటు
న్నాయి.

ఇంతరాత్రివేళ నిద్రకు దూరమైనకళ్ళతో
కవితకోసం అన్వేషిస్తున్నాను
క్రిక్కిరిసిన భావాల బరువుకు
వంగిపోయిన మనస్సు
భారాన్ని పంచుకునే కవితకై
ఆశగా ఎదురు చూస్తోంది.

అర్ధరాత్రి కూడా నిద్రపోనివారు
అయిదుగురు
జూదరి - విరాగి - చోరుడు
కామాతురుడు - 'కవి'

—•••—

# బాపిరాజుగారి అసంపూర్ణ నవల 'మధురవాణి'

— శ్రీ ధనిరెడ్డి విజయలక్ష్మీదేవి, ఎం. ఏ.

భావకవిత్వయుగంలో తనలో ఉద్భవించిన ప్రతిభావాన్ని లలితంగా, కళాపూర్ణంగా, సౌందర్యవంతంగా తీర్చిదిద్దారు బాపిరాజుగారు. ఆయన సుకుమార భావనాపటిమను భాష కూడా భరించలేకపోయింది. అంతటి లలితమైన భావన చేయగల భావుకులు బాపిరాజుగారు. ఆయన కవి, చిత్రకారుడు, కథకుడు, నవలా రచయిత. ఇన్ని ప్రజ్ఞలు బాపిరాజుగారిలో ఉండటంవల్ల ప్రత్యేకంగా దేనిలోను తనదైన ప్రతిభను చూపలేకపోయారు. ఆయన బహుముఖ ప్రజ్ఞాపాటవం పైచెప్పిన వాటిల్లో ఏ ఒక్కదానిలోను ఆయన్ని సమగ్రంగా చూపలేకపోయింది.

బాపిరాజుగారు ప్రత్యేక వ్యక్తి. బాపిరాజుగారే ఒక లలితకళ. వారు ఎదురుగా ఉంటే శిల్పం, చిత్రలేఖనం, సంగీత, కవిత్వ, నాట్యాదులు మన ముందున్నట్లే. బాపిరాజుగారు ఎన్నో గేయాలు వ్రాశారు. చిత్రాలు గీశారు కథలు కూడ నలభై వరకు వ్రాశారు. కాని వారి నవలల సంఖ్య తక్కువ. తొమ్మిది మాత్రమే వారి సంపూర్ణనవలలు.

బాపిరాజుగారు సహజంగా బద్ధకస్తులు. వారు ఈదినం ప్రారంభించిన పనిని తిరిగి ఏసంవత్సరానికో కాని పూర్తి చేయరు. వారు ఎన్నో గేయాలని, చిత్రాలని, కథలని కూడ అసంపూర్ణంగా వదలేశారు. ఈ బద్ధకమే వారి నవలా వ్యాసంగంలో కూడ కనిపిస్తుంది. మొదట్లో హిమబిందు, నారాయణరావు నవలలు మిత్రుల ప్రోద్బలం మీదను, ఆంధ్రవిశ్వవిద్యాలయం నవలల పోటీ నిర్వహించడం మూలంగాను వెలువడినాయి. తర్వాత సాంసారిక, ఆర్థిక పరిస్థితుల ఒత్తిడివల్ల కొన్ని సంవత్సరాలు వారి నవలారచన ఆగిపోయింది.

వారు 'మీజాన్'లో సంపాదకులుగా ప్రవేశించినపుడు తిరిగి నవలా వ్యాసంగాన్ని ప్రారంభించారు. ఆ ఒరవడిలో వెలువడినవే అడవిశాంతిశ్రీ, తుఫాను, కోనంగి, గోనగన్నారెడ్డి. 'ఆంధ్రమహిళ' మాసపత్రికలో ధారావాహికంగా వీరి 'జాజిమల్లి' నవల వెలువడింది. 'నరుడు' నవల కూడ వీరు వ్రాసిందే.

ఇలా అచ్చు అయిన నవలలు కాక వీరి అసంపూర్ణ నవలలు, నవలలకై తయారుచేసుకున్న కథా సంగ్రహాలు, నాటికలు, ఒక అనువాద నాటిక, కొన్ని వ్యాసాలు, ఎన్నో అసంపూర్ణంగాను; సంపూర్ణమైన కథలు, వ్యాసాలు, గేయాలు మొదలైనవి అముద్రితంగాను ఉండిపోయాయి. ఇవేవీ వెలుగులోకి రాలేదు అనేకంటే వెలుగులోకి తీసుకొని వచ్చేందుకు ఎవరూ ప్రయత్నించలేదనే చెప్పాలి.

బాపిరాజుగారి అసంపూర్ణ నవల 'మధురవాణి' వ్రాసినంతవరకు అచ్చయింది. బాపిరాజుగారు 'హైదరాబాదులో' 'మీజాన్' ఆఫీసులో పనిచేసేటప్పుడు 'మధురవాణి' వ్రాశారు. వ్రాసినప్పుడంతా దానిని బాపిరాజుగారే ప్రింటు చేయించుకుంటూ వచ్చారు. తర్వాత రజాకార్ల గొడవలలో వారు సకుటుంబంగా హైదరాబాదులో మకాం ఎత్తేసి గుంటూరుకు వెళ్లారు. తర్వాత 'మధురవాణి' నవల పూర్తికాలేదు. ఆయన 'ఆంధ్రప్రభ' దినపత్రిక ద్వారా ఈ నవలని ధారావాహికంగా ప్రచురించాలని ప్రయత్నించారు. కాని ఆ ప్రయత్నం ప్రయత్నమాత్రంగానే ఉండిపోయింది. అలా ప్రచురించి ఉంటే 'మధురవాణి' నవల పూర్తయి ఉండేది. కాని ఆంధ్రులకా అదృష్టంలేదు.

'మధురవాణి' చారిత్రక నవల. తంజావూరాంధ్ర నాయక రాజులలో ప్రముఖుడు, వీరుడు, కవిత్వ ప్రియుడు, సంగీత కళాపిపాసి అయిన రఘునాథ నాయకుని కాలానికి సంబంధించిన దీనవల.

ఈ నవలలో వ్యక్తులను, కొన్ని సంఘటనలను మాత్రమే వీరు చారిత్రక ఆధారాల నుండి గ్రహించారు. మిగిలిన సంఘటనలన్నీ వారి స్వకపోల కల్పితాలే.

'మధురవాణి' నవల వ్రాసినంత వరకు కథ చాల స్వల్పం. నవలలో సంఘటనలు ప్రాధాన్యం వహిస్తాయి.

రఘునాథ నాయకుని ఊరేగింపు సమయంలో అతని రథంముందు నాట్యమాడుతున్న బాలికలలో చెంచులక్ష్మి అతన్ని ఆకర్షిస్తుంది. చెంచులక్ష్మి కూడ రఘునాథ నాయకుని పట్ల ఆకర్షితురాలౌతుంది. ఆమె వయసు పది, పదకొండు సంవత్సరాలే అయినా. ఆమె రఘునాథ నాయకుని తన మనోనాయకునిగా ఆరాధిస్తుంది. ఆ చిన్నతనంలోనే తనుకూడ కవయిత్రి గంగాదేవిలాగా, తన ప్రభువు రఘునాథుని తన కావ్య ప్రౌఢిమతో, సంగీత రసికతతో మెప్పించే సమయం రావాలని ఆత్రపడుతుంది.

చెంచులక్ష్మి వేశ్యాకుల సంజాత, ఆమె తల్లి మరకతవల్లి. రఘునాథ నాయకుని మేనమామ అయిన మూర్తిప్ప నాయుడు మరకతవల్లిని గాంధర్వ వివాహం చేసుకున్నాడు. వారి గారాబుపట్టి చెంచులక్ష్మి, చెంచులక్ష్మి గోవింద దీక్షితుల శిష్యురాలు. అతని దగ్గర సర్వ విద్యలు నేర్చుకుంటూ ఉంటుంది.

రఘునాథ నాయకుడు కూడ గోవింద దీక్షితుల ప్రియ శిష్యుడు. రఘునాథ నాయకుడు అతని కడనే సర్వవిద్యలు నేర్చుకున్నాడు. గోవింద దీక్షితులు అతనికి గురువు, మంత్రి. గోవింద దీక్షి

తుల కుమారుడు యజ్ఞ నారాయణుడు రఘునాథ నాయకుని శిష్యుడు.

గోవింద దీక్షితులు తంజావూరు రాజ్యానికి చినచెవ్వప్ప కాలంనాటి నుండి అమాత్యుడుగా ఉంటున్నాడు. తళ్లికోట యుద్ధానంతరం ప్రయాణ సందర్భంలో తమతో కలిసి ప్రయాణం చేస్తున్న విశ్వేశ్వర దీక్షితులు పరిచయం కాగా, అప్పటికే తనకు సరియైన మంత్రి కోసం వెదకుతున్న చెవ్వప్ప నాయకుడు, అతని కుమారుడు గోవింద దీక్షితులను తనకు మంత్రిగా పంపమని విశ్వేశ్వర దీక్షితులను ప్రార్థిస్తాడు. అగ్నిహోత్రంతో గోవింద దీక్షితులు తన భార్యతో తంజావూరు వచ్చి అప్పటి నుండి రఘునాథ నాయకుని కాలం వరకూ వారికి మంత్రిగా ఉంటాడు.

గోవిందమఖి తన శిష్యులకు పాఠాలు బోధించే సమయంలో రఘునాథ నాయకుడు అక్కడికి వస్తాడు. తురుష్కులతో యుద్ధంచేసి వచ్చినతర్వాత అదే అగురు శిష్యుల ప్రథమ కలయిక, యజ్ఞనారాయణుడు రఘునాథ నాయకుని శౌర్య పరాక్రమాలను, అతడు తుండీరవిభుని కుమార్తె 'చెంచులక్ష్మి'ని వివాహమాడటం మొదలైన సంఘటనలను వర్ణించే 'రఘునాథాభ్యుదయ' కావ్యంలోని రామభద్రాంబ వ్రాసినశ్లోకాలను చదువుతాడు, చెంచులక్ష్మి రఘునాథుని సాహసకార్యాలు వింటూ పరవశ అవుతుంది.

ఆసందర్భంలోనే రఘునాథ నాయకుడు ఆమెను సంస్కృత కావ్యాల్లోను, పాణిని వ్యాకరణంలోను పరీక్షించాడు. ఆదినమే సాయంకాలం గోవింద దీక్షితుల కోరికతో ఆమెకు సంగీత, నాట్యాల్లో పరీక్ష జరిపి కానుక లిస్తాడు. చెంచులక్ష్మి తనమేనమామ కూతురని తెలిసిన తర్వాత రఘునాథ నాయకునికి ఆమెపై అనురాగం మరింత పెరుగుతుంది.

రఘునాథ నాయకుడు దక్షిణ నాయకుడు, కళావతి, రామభద్రాంబ, చెంచులక్ష్మి ఆయన భార్యలు, రఘునాథుడు ముగ్గురిని సమానంగానే ప్రేమిస్తాడు. వారిలో భేదాలు లేవు. ఆయన వారితో కవితాగోష్ఠులు కూడ జరుపుతుండేవాడు. రెండవ భార్య రామభద్రాంబ ఆయన శిష్యురాలు. ఆమె అతని పరాక్రమాది విశేషాలను గురించి 'రఘునాథాభ్యుదయ' కావ్యాన్ని వ్రాస్తోంది.

ఇక నవలలో చివరిభాగ మంతా చేమకూర వెంకటకవి రఘునాథ నాయకుని ఆశ్రయాన్ని పొందటానికి వచ్చిన విధానాన్ని వర్ణిస్తారు బాపిరాజుగారు.

తండ్రి లక్ష్మణమంత్రి చనిపోవడంతో నిడుదవోలు రాజాస్థానం నుండి వచ్చే ధనసహాయం ఆగిపోవటం వల్ల పువ్వులమ్మినచోటే కట్టెలమ్మటం ఇష్టంలేక వెంకటకవి సకుటుంబంగా దక్షిణ యాత్రకు బయలు దేరతాడు. శ్రీశైలం, మంగళగిరి, కాళహస్తి మొదలైన పుణ్య క్షేత్రాలు దర్శిస్తూ, తిరుపతిలో వెంకటేశ్వరస్వామి ఈ రాఘవమూర్తిగా దర్శన మివ్వటంతో, ఆదర్శనంలోని మహాభావం వెంకటకవికి స్ఫురించి, తాను చంద్రగిరికి వెళ్ళి వెంకటపతి రాయల ఆశ్రయాన్ని పొందాలన్న ఉద్దేశాన్ని మానుకొని, తంజావూరికి యాత్ర సాగిస్తాడు. దారిలో అనేక కష్టనష్టాల కోర్చి తంజావూరు చేరుకొని, గోవిందమఖిని దర్శించి రాజాశ్రయం ఇప్పించ గోరుతాడు. గోవింద దీక్షితులు అతని పద్యాలు, వాటిలోని రామణీయకత చూసి, రాజాస్థానానికి వెళ్ళేలోగా మరికొన్ని పద్యాలు వ్రాయమని వెంకటకవిని ప్రోత్సహిస్తాడు. నవల ఇంతటితో అసంపూర్ణంగా ముగిసింది.

ఇది అసంపూర్ణ నవలే అయినా ఇందులో అడుగడుగునా కావ్య, సంగీత, నాట్యాల మధురిమ మనల్ని ఆకర్షిస్తుంది.

ఉత్తర రామచరిత్ర, మధురా విజయం, ఆచార్య సూక్తి ముక్తావళి, రఘునాథాభ్యుదయం మొదలైన సంస్కృత కావ్యాల్లోని శ్లోకాలు, రామాయణ సార సంగ్రహంలోని పద్యాలు మొదలైనవి ఉదహరించటం వల్ల మనకుపూర్వ కావ్య పరిచయం చేకూటమే కాక, బాపిరాజుగారికి ఆకావ్యాల పట్లగల అభిమానం కూడ వ్యక్తమౌతుంది.

చేమకూర వెంటకవికి గల శాస్త్ర వైదుష్యాన్ని, పాండిత్యాన్ని పేర్కొంటూ, కుమార సంభవం, కవిత్రయ భారతం, పండితారాధ్య చరిత్ర, బసవపురాణం, దశకుమార చరిత్ర, రంగనాథ రామాయణము, శివనీతి సారము మొదలైన ప్రాచీన-తెలుగు కావ్యాలన్నింటిని చేమకూర కవి చదివాడంటూ, ఆకావ్యాలను పేరుపేరునా పేర్కొని తమకుగల ప్రాచీన కావ్యాభిమానంలో పరవశించి పోతారు బాపిరాజుగారు.

ఇందులో కథంతా రఘునాథ నాయకుడు, చెంచులక్ష్మి(మధురవాణి) 'పాత్రల చుట్టూ మలచబడింది. ప్రధానకథ వారి మధ్య ప్రేమోదయం మాత్రమే. మిగిలిన నవలంతా సంఘటనలు ప్రాధాన్యం వహిస్తాయి.

బాపిరాజుగారు ఈనవలను పూర్తిచేసి ఉంటే చారిత్రక నవలల స్థాయిలో మరోమంచి నవల మనకు లభ్యమై ఉండేది.

ఇంచుమించు బాపిరాజుగారు ఆంధ్రదేశాన్ని పరిపాలించిన చక్రవర్తులందరికీ సంబంధించిన విషయాలనే కథలుగా తీసుకొని నవలలు వ్రాయడానికి ప్రయత్నించారు. కాని మధురవాణి, విజయనగర సామ్రాజ్య కథనాన్ని తెలిపే 'శిలారథం' అన్ననవలలు, 'కైలాసేశ్వరుడు' అన్న చాళుక్య సామ్రాజ్యానికి చెందిన మరోనవల వెలుగులోకి రాలేక పోయాయి.

—•••—

# జాషువా కవిత్వంలో ప్రకృతితత్త్వం

— శ్రీ డా. జి. వి. ఎస్. ఆచార్య, ఎం.ఏ., పిహెచ్.డి.

జాషువగారి 'పిరదౌసి, కొత్తలోకము, ముంతాజ్ మహల్, స్వప్నకథ'మున్నగు కావ్యములలోని ప్రకృతితత్త్వమును పరిశీలించుచు నేను వ్రాసిన వ్యాసములు ఇంతకుపూర్వము 'సమాలోచన'లో ప్రచురింపబడినవి. ప్రస్తుతం జాషువగారి ప్రకృతి వర్ణనాత్మకములైన ఖండికలను పరిశీలించుటయే ఈ వ్యాసోద్దేశము.

ప్రకృతికిని కవిత్వ సాహిత్యములకును అవినాభావ సంబంధము కలదు. కవితావతరణమే ప్రకృతివర్ణనలతో ప్రారంభమైనదని అభిజ్ఞుల అభిభాషణము. ప్రకృతి యందలి సుందరము, ఉత్కృష్టము నైన ఒకవస్తువు ప్రాపుగా ఉపమించి కవి తన భావమును సువ్యక్తము చేయఁబూనును.

'Poetry every where has found in nature some of the most valuable sources of its inspiration and subjects of its interpretations. It teems with descriptions of nature or with analogies drawn from its workings of its scenes, sometimes with mystical writers it regards nature as a symbol of spiritual varieties - 'a living garment of God' "1

[తన ఊపిరికి అత్యమూల్యమైన మూలాధారములును వ్యాఖ్యానాపేక్షితములైన అంశములును కవిత్వమునకు ప్రకృతియందు దణువణువున గోచరించుచుండును. తామరతంపరలైన ప్రకృతివర్ణనలతోడను, ప్రకృతి దృశ్యములనడకనుండి గ్రహింపబడిన సాదృశ్యములతోడను, కవిత్వము నిండియుండును. మర్మగర్భితములైన రచనలు చేయగల కవు లుండుట వలన కవిత్వము ప్రకృతిని ఆత్మవైవిధ్యమునకు సంకేతముగను, భగవంతునియొక్క 'సజీవమైన దుకూలము'గను పరిగణించుచున్నది.] అని కవిత్వముపై ప్రకృతి ప్రభావము విశదీకరింపబడినది.

ప్రకృతి దర్శనముతో కవికి కలిగిన అనుభూతి స్పందనమే కవిత్వరూపము నొందు ననియు, చర్మ చక్షువునకు గోచరించు ప్రకృతి మనోనేత్రమున భగవానుని లీలలను స్ఫురింపజేయ గలుగుననియు రూఢియగుచున్నది. ప్రకృతి ప్రత్యణువులో భగవత్తత్త్వము ప్రతిపాదితము. ప్రకృతి మానవునకు కవిత్వపటుత్వ సంపదను ప్రసాదించి, సాహిత్యమును శోభింపజేయుచు, సృష్టికర్తయెడ భక్తి ప్రపత్తులను ప్రసరింప జేయుచున్నది.

భావకవిత్వములో ప్రకృతి కవిత్వము అగ్రపంక్తిలో నిలిచిన శాఖ, 'కవి, చిత్రకారుడు, నిద్దఱును బ్రకృతి పరిశీలకులు. కవిప్రయుక్తము నకు 'స్వభావోక్తి' ప్రధాన పరికరము.'2 నవ్యకవులు కొంతవరకు వాల్మీకికి సన్నిహితులు. 'వాల్మీకి యొక్క స్వాభావిక రీతితోనే వీరు తృప్తిపడక ప్రాయికముగా ప్రకృతిని స్వీయసుఖ ప్రకటనకు, ఆత్మానుభూతి సమున్మీలనమునకు ఆలంబముగా గ్రహించిరి.'3 అని డా॥ సి. నారాయణరెడ్డిగారు అభివ్యక్తము చేసినారు. ఇక నవయుగ కవిచక్రవర్తులైన జాషువగారి ఖండికలలో ప్రతిపాదింపబడిన ప్రకృతితత్త్వమును పరిశీలింతము.

ఖండకావ్యము మెదటి భాగమునందు 'శిశువు' అను ఖండికలో శైశవదశను గురించి వర్ణించినారు. 4 ఈ బాల్యస్మరణమునకు ప్రకృతియే ప్రధాన హేతువు. శిశువుయొక్క చేష్టలను వర్ణించుచు-

'బొటవ్రేల ముల్లోకములు చూచిలోలోన
నానందపడు నోరులేని యోగి
తల్లిదండ్రుల తనూవల్లికి ద్వాయికి వ
న్నియఁ బెట్టు తొమ్మిది నెలలపంట
అమృతంబు విషమును వ్యత్యాస
మెఱుఁగక
స్వాదింపఁజను వెఱ్ఱిబాగులాడు
అనుభవించు కొలంది నినుమడించు మ
మరం
దము జాలువారు చైతన్య ఫలము
భావరాదు, వట్టిపాలుమాత్రమె త్రాగు
నిద్రవోవు, లేచి నిలువలేడు
ఎవరెరుంగ, రితని దేదేశమో కాని
మొన్న మొన్న నిలకు మొలిచి నాఁడు.'

శిశువు ఒంటరిగ నూకొట్టు కొనుటకు ఊయేల, తొట్టి ఇచ్చు ఉపదేశమును కారణముగను, బిగ్గరగా కేరింతలాడుటకు పరమేశ్వరుడాడు సరసములను కారణముగను, కవిగారు ఊహించినారు. శిశు వేడ్చి తల్లిచే నూడిగము చేయించుకొనుటకు, తల్లితో శిశువునకు గల సంబంధము గట్టిదై యుండవచ్చు నని భావించినారు. తల్లి శిశువునుగూర్చి బంగారు కలలు కనును. ఆ కలలను శిశువు పండించునా? అని ప్రశ్నించుకొనినారు.

'గానమాలింపక కన్నుమూయని రాజు
అంబకాఁగిటి పంజరంబు చిలుక
కొదమ కండలు దేరుకొను పిల్లవస్తాదు
యుయ్యేల దిగని భాగ్యోన్నతుండు
ఊ ఊలు నేర్చిన యొక వింత చదువరి
సతిని ముట్టని నాటి సాంబమూర్తి
ప్రసవాబ్ధి తరియించి వచ్చిన పరదేశి
తనయింటి క్రొత్తపెత్తనపు దారి

ఏమిటనిమీద భూమికి జేరినాఁడో
నడువ నేర్చిన పిమ్మట నడుగడలయి
నేండ్లుగడచిన ముందుముం దేమొకాని
యిప్పటికి మాత్ర మేపాప మెఱుఁగఁ
డితఁడు.'

అని శిశువుయొక్క సహజ ప్రకృతిని వర్ణించినారు. ఇందు 'అమృతంబు-విష మను వ్యత్యాస మెఱుఁగ కాస్వాదింప జను వెఱ్ఱిబాగులాడు', 'ప్రసవాబ్ధితరి యిచ్చి వచ్చిన పరదేశి...' ఇత్యాది వర్ణన లోని భావవ్యక్తీకరణ మత్యద్భుతము. జీవనధర్మములను సునిశితముగ విమర్శింప గలశక్తి జాషువగారిలో నున్న దనుట కీవర్ణనలు నిదర్శనములు.

'కవితకి రెండు కళ్లు. ఆలోచన - అనుభూతి. అవి రెండే కాగితాలు నింపటం తప్ప మరేవీ జరగదు. చదవాలి - జీవితాన్ని, ఆలోచించాలి అనుభూతిని - ప్రతిభాస్పందంతో - అప్పు డవుతుంది కవిత - ఒక సౌందర్యస్యందనం - అను జీవనదర్శనం'[5] అని డా॥ అరిపిరాల విశ్వంగారు అన్నమాటలను జాషువగారి కవిత్వమునకు అన్వయింప వచ్చును.

'శిశుప్రబోధము' అను ఖండికలో—

'పురిటింటన్ జరణంబు మెట్టి, భువనం
బున్ జూచి, కంఠంబుబొం
గురువోవం బలవింతు వేమిటికి ? నీ
వ స్వాక లోకంబు క్ర
మ్మఱరాదోయి దిగంబరీ ! ఇచటి కా
మక్రోధ లోభాలవన్
గుఱియైపోవక తప్పు, దూరడిలి బం
ధుప్రాతిమున్ దన్నుమా !'

అని ప్రబోధమును కావించినారు.

'పరమం బగు వత్సలతా
కరనిధి యనఁజాలు తల్లిసముఖంబున నీ
మరణమువలనం దఱుచగు
పరలోకసుఖం బొకింత ప్రతిబింబించున్'

అని మాతృ వాత్సల్యము యొక్క గొప్పతనమును విశదీకరించినారు.

'నికుంజము' అను ఖండికలో—

'అఁకొనియున్న తేంట్ల మధు
రాన్నముఁ బోకిరిగాలి పిల్లవాఁ
డావల పెట్టినాఁడు' చిగు
రాకుల కోకలఁగట్టుకొన్న పుం
స్కోకిలవాణి ! పుష్పితని
కుంజవిలాసిని, తేనెలేని పూ
రేకుల కుప్పవీథుల, ద్వి
రేఫము గానము సేయఁబోవునే ?'

ఇందలి 'గాలిపిల్లవాడు, చిగురాకుల కోకలు, నికుంజ విలాసిని' అను రూపకములు రమణీయముగా నున్నవి

'భోగముసానులై కుసుము
పుంజములవ్వులం చిమ్ము తేంట్లకున్
ద్రాగుడు నేర్పు చుందురు గ
దా ? వనకన్యలు, కాకిగూఁటిలో
మూఁగతనంబునం బొవలు
ముద్దులకోకిలపాటగట్టి మి
మ్మాగము సేయుచున్నది, గ
యాళిసుమీ ! మధుమాసనంగతిన్'

అని మధుమాసమును మహనీయ మగు భావనా బలముతో మనోహరముగ వర్ణించినారు.

'శ్మశానవాటి'[6] అను ఖండికలో —

'ఆకాశంబునఁ గాఱుమబ్బుగములా
హారించె, దయ్యాలతో
ఘూకంబుల్ చెరలాడసాగినవి, వ్యా
ఘోషించె నల్దిక్కులన్
గాకోలంబులు గుండె ఝల్లుమనుచు
న్నంగాని యిక్కాటిలో
నా కల్లాడిన జాడలే దిచట సౌ
ఖ్యం బెంత క్రీడించునో !'

'ముసురుతమస్సులో మునిఁగి
పోయిన క్రొత్తసమాధిమీద బై
బాదలు మిణుంగురుంబురువు
పోలిక వెల్గుచునున్న దివ్వె, ఆ
ముదముడిపోయినన్ సమసి
పోవుటకే, దదిదీపమందు మా,
హృదయముమమ్మ్రి నిల్పిచని
రెన్గత పుత్రిక యేయుభాగ్యయో.

అనుచు శ్మశానవాటియందలి భీభత్సమును వర్ణించుచు—

'కవులకలాలు, గాయకుల
కమ్మనికంఠము లీశ్మశానపుం
గవనుల ద్రొక్కిచూచెడి నొ
కానొకనా !, డలకాళిదాస భా
రవుల శరీరముల్ ప్రకృతి
రంగమునం దిపు డెంతలేని రే
ణువు లయి మృత్తికంగలిసె
నో కద యమ్మరివానిసారిపై !'

అనివాపోయినారు, 'జాతస్య హి ధ్రువో మృత్యుః' అని సూక్తియైనను శ్మశానవాటిని దర్శించిన కవిగారి హృదయము ద్రవించి శోకపూరితమై కరుణ రసాత్మకములైన పద్యములను వెలువరించినది. జనన మరణములు ప్రకృతి సిద్ధములు. అయినను జన్మించినవారిని జూచి సంతోషించుటయు, గతించిన వారికొరకై విలపించుటయు నీలోకమున పరిపాటియైనది. సహజముగ కరుణాహృదయులైనజాషువగారిచేత 'శ్మశానవాటి' కన్నీరును ఒలికించి, కవిత అల్లించుటలో నాశ్చర్యము లేదు.

'ఇటనస్పృశ్యత సంచరించుటకు, దా
వే లేదు, విశ్వంభరా
నటనంబుల్ గబళించి, గర్భమున వి
న్యస్తంబు గావించి, యు
త్కటపుం బెబ్బులిపోడ మేఁక పొకక్ర
క్కంజేర్చి జోకొట్టి యూ
ఱటగల్పించు నభేదభావ మను ధ
ర్మంబిందుఁ గారాడెడిన్'

అని 'శ్మశానవాటి'లో సమతను సాధించిన గొప్ప భావులుకులు వీరు. పైపద్యముపై 'బైబిలు' ప్రభావము కలదు.

'గిజిగాడు' అను ఖండికలో—

'జిలుగుం బంగరు రంగులం గులుకు మే
 ల్చిన్నారి పూగుత్తిసొ
మ్ములు గీలించిన తుమ్మకొమ్మలకు, నీ
 వున్నీ సతీరత్నమూ
యొలగీమున్ దగిలించిరేఁ బళిరా హో
 యిందూగ రాగాడ్పు బి
డ్డలు మీ కూడిగ మాచరింప, గిజిగాఁ
 డా! నీవు దీర్ఘాయువౌ!'

అని దీవించుచు, మానవులకు సాధ్యము కానట్టి తేలికగడ్డి పోచలతో తూగుటు య్యేల గృహమును రచింపగలశక్తి ఒక్క గిజిగాడులోనే యున్నదని దాని కళా వైదుష్యమునకు, శక్తి సామర్థ్యములకు పులకించినారు.

'తనను సంఘం బహిష్కరించగా ఊరికి దూరంగా వున్న పాతమసీదులో కూర్చునిఉండగా సాలీడు ఒకటి తన ప్రక్కనె గోడమీద గూడు నిర్మిస్తూ వుంది. అది అనేకసార్లు క్రిందపడటం మరలా పైకి ప్రాకడం చూచి 'సాలీడు-బ్రూసు' కథను జ్ఞాపకం చేసుకొన్నారు. నన్ను క్రింద పడవేసినంత మాత్రాన నేను ఎందుకు అణగిపోవాలి? పైకి లేవడానికి ఎందుకు ప్రయత్నించకూడదు? అనుకొన్నారు. అప్పుడే 'సాలీఁడు' మీద పద్యాలు వ్రాశారు.7...

'సాలీఁడు' అను ఖండికలో—

'నీలో నూలు తయారుచేయు మరగా
 నీ, ప్రత్తిరాట్నంబుగా
నీ, లే, దీశ్వరశక్తి నీకడుపులో
 నే లీనమై యుండునో
యేలీలన్ రచియింతు వీజిలుఁగు నూ
 లీపట్టుపుట్టంబు! లో
సాలీఁడా! నిను మోసగాఁడ వని
 విశ్వం బేల ఘోషించెడిన్?

అని సాలీడులో నున్న ఈశ్వరశక్తిని కొనియాడుచు, 'ఢాక్కామల్లుపసందు నేతపనివాండ్రా, నీ యుపాధ్యాయులు?' అని ప్రశ్నించినారు.

పక్షులనుండి, పురుగులనుండి, జీవన రహస్యములను, అవ్యక్త మధురానుభూతులను, పిండుకొనగలిగిన దిట్ట యగుటచే జాషువగారు 'గిజిగాడు, సాలీఁడు' అను ఖండికలను రసమయముగా రచించినారు.

'నెలబాలుఁడు' అను ఖండికలో —

'గగనకల్యాణి గండభాగమున నిడ్డ
కాలపురుషుని గురునఖక్షతముఁ బోలి
మంచునవ్వుల నదెచందమామ బుట్టు
జననమైనాఁడు పశ్చిమశైలశిఖరి.

అని చందమామను వర్ణించినారు. ఇందలి భావనవ్యత పతాకస్థాయిలో నున్నది.

'పున్నమనాఁడు నీవు పరి
 పూర్ణశరీరుడవై సుధావిలా
సోన్నతి నవ్వుచుం బొడము
 చుందువు లోకము సంతసింప నో
క్రొన్నెలబాల! యారుపది
 రోజులజీవికి నవ్వువచ్చునే!
యన్నముపట్టునే! పరహి
 తార్థివి నీకు విచార మున్నదే!

అని చందమామను కొనియాడినారు. 'పరహితార్థి' అని సంభావించుట విశిష్టముగా నున్నది.

'నెమలినెలఁత' అను ఖండికలో—

'ఉఱుముతి మెం, దళుక్కుమను
 చున్నదిమించను మోసకత్తె, యం
బరమున మబ్బు లేలినవి,
 మంజులకేంకృతు లొప్ప నీమనో
హరుఁ డురుపింఛ దీధితుల
 నారతులీయఁదొడంగెఁ, గేకి సుం
దరి! పొదరిండ్లతీవపర
 దాల మఱుంగునఁ జెంగలింప వే!

'భద్రపహోంబట్టు జిలుఁగుటంబరముదాల్చి
విపినవీథులలోఁ దాండవించుచుండఁ
జేరువను నిల్చి మాసినచీరఁ గట్టి
మురిసికొనుపతివ్రతవు సుందరులలోన.'

అని నెమలినెలఁత యొక్క సహజప్రకృతిని మానవతాదృక్పథముతో రమణీయముగ వర్ణించి చెప్పినారు.

'తుమ్మెద పెండ్లికొడుకు' అను ఖండికలో మానవులకు ఉదాత్తసందేశమును నందించినారు. జాషువగారి ఖండికలన్నియు ప్రయోజనాత్మకములై విలసిల్లుచుండును. ఏవస్తువునకు కవితా రూపమొసంగినను, ఒక పరగు ప్రయోజనము దృష్టియందుంచుకొను నుత్తమగుణము జాషువాగారిని కవిగా చిరంజీవిని చేసిన దని నా యభిప్రాయము.

'కూరిమిపల్లవింప నది
 గో! సుదతీమణులెల్ల నీముఖాం
భోరుహదర్శనార్థమయి
 పుప్పొడి పుట్టములన్ ధరించి కా
సారనికేతనాంగణ వి
 శాలతలంబుల విశ్రమించి యు
న్నా, రిక రాకయున్న, దహ
 నంబున గ్రుంగెద రోయి షట్పదా!'

'బంగరుపూవుటిండ్లతల
 వాకిలిఁ ద్రొక్కనిబిచ్చగానిని
న్నుంగని నవ్వుచుండు సుమ
 నోనిచయం, బిది యేటి వింత? నీ
యంగనకంతమం దలర
 దా యలనాటి సువర్ణసూత్ర? మో
భృంగకుమారకా! కుదుఁ
 బెట్టవుగా? మధుమద్యపాయివై.'

అని తుమ్మెద పెండ్లికొడుకును హెచ్చరించినారు.

(సశేషము)

---

1. 'Encyclopaedia of Religion & Ethics' vol. IX
2. 'స్వభావోక్తి' - కల్లూరి వేంకటసుబ్రహ్మణ్య దీక్షితులు.
3. 'ఆధునికాంధ్రకవిత్వము' - డా॥ సి. నారాయణరెడ్డి. పు. 419

## కాలం సత్యం - శ్రీ శివకుమార్

ఎక్కడో దూరాన
వినిపించును ఒక
మధురపిక నాదం
విచ్చుకొనును ప్రాచ్యదిశ
తొలివేకువ పసిడి మొగ్గ
కాంతికిరణ కరాంగుళిస్పర్శకి
పులకించును పచ్చని ప్రకృతి
జీవిత కాంతి దీధితులను
రాహువువలె కబళించ నెంచు
మృత్యుకరాళ దంష్ట్రిలు
గ్రసించ లేదు మృత్యువు
వేయివెలుగుల వెగ జిమ్ము
అమృత కాంతిలవారి
తమస్సును దహించును
తపోజ్ఞానాగ్ని జ్వాలలు
కాల మొక నిర్ఝరిణి
నిరంతర పరిణామ శైవలిని
జీవితవక్ర రేఖలో
మరణం అంతిమ స్థిర బిందువు
మరణం క్షణికం
మరణం మిథ్య
కాలం శాశ్వతం
కాలం సత్యం.

( 24 వ పేజీ తరువాయి )

4. 'శైశవస్మృతి' ప్రకృతి కవిత్వములో చేరునంటిని. వర్డ్సువర్తు వలెనే తెలుగు భావకవి 'శైశవ స్మృతి'కి సంబంధించినగీతము లాలపించినాడు.

—అధునికాంధ్రకవిత్వము. డా॥ సి. నారాయణ రెడ్డి. పు. 430.

5. 'సిందూరం' _ కవిత పేరు 'ముందు చూపు' డా॥ అరిపిరాల విశ్వం పు. 7.

6. మాఇంటికి ఎదురుగా శ్మశాన వాటికవుంది. చింత, వేపచెట్లనీడను దీర్ఘనిద్రపోతున్న అమృతులు, దయనీయ స్థితిలో వున్న చిన్నపిల్లల అసమాధులు ఆయన హృదయాన్ని కరిగించగా ప్రవహించిన ఆవేదనయే'శ్మశానవాటిక'అన్న ఖండిక— 'మానాన్నగారు'

శ్రీమతి హేమలతా లవణం. పు. 11

7. 'మానాన్నగారు' —శ్రీమతి. హేమలతాలవణం. పు. 41, 42 *

## సరసకవిత్వ కాంతరో!

— శ్రీ విద్వాన్ బులుసు వేంకటేశ్వరులు, ఎం. ఏ.

పరమ మహత్త్వ మంది బహుభాగ్యములన్ దులదూఁగి రాజాలా
దరమును జూప సత్కవులు ధన్యతకోసము నిన్నుఁ గొల్వ మున్
నిరుపమతన్ వెలిగించితివి నేఁడో సమస్తము తాఱుమాఱుగా
సరస కవిత్వకాంతరో! ప్రశాంతముగా సుఖసుప్తి నందుమా.

బరువు అలంకృతుల్ కరము భారము లంచిత సంప్రదాయముల్
సురుచిరమై మనోజ్ఞమయి సుస్థితిఁ గాంచినఛంద మన్న దు
ర్భర మగు మందబుద్ధులకు వారిది పెద్దది సంఖ్య యిప్పుడో
సరసకవిత్వకాంతరో! ప్రశస్తముగా సుఖసుప్తి నందుమా!

పర మనఁగా నిహం బనఁగ భావమె లేని విదేశదుష్కవుల్
గురువులు వీరి కాదరణ గొప్పది వీరికి వారిపైని సుం
దరమహనీయ భారత విధానము నచ్చదు వీరి కందుచే
సరసకవిత్వ కాంతరో! ప్రశస్తముగా సుఖసుప్తి నందుమా.

సురుచిరమై అనర్ఘమగు సుందరరత్నము మెచ్చుకున్న నె
వ్వరి దగు లోటు? రత్న మది వచ్చి తమం గొనుఁ డంచుఁ గోరునే?
పరమపవిత్రరత్నమవు భారతి! నీ విలువన్ గ్రహింపమిన్
సరస కవిత్వ కాంతరో! ప్రశాంతముగా సుఖసుప్తి నందుమా.

కరమును గౌరవించినది గా నిను మున్ను మహాంధ్ర మెంతయున్
సరిసరి దుర్దశం గనుటఁ జచ్చుకవిత్వమె మెచ్చు హెచ్చుగా
తరతమభేదముం దెలియఁ దజ్జ్ఞులు తక్కువ యైరి గావ నో
సరస కవిత్వకాంతరో! ప్రశాంతముగా సుఖసుప్తి నందుమా.

తిరుగఁబడున్ సమస్తమును దివ్యమహోన్నతపూర్వసుస్థితిన్
మరలఁ గడింపగాఁగలవు మాతరో! నీమహనీయశక్తియే
కరము సమర్థ మందుఁ గావునఁ గాలము వచ్చుదాఁక నో
సరసకవిత్వకాంతరో! ప్రశాంతముగా సుఖనిద్ర నందుమా.

తరగతులన్నిటన్ గడు మొదంబున బాలురు కంఠపాఠమున్
మరల నొనర్పఁగాగలరు మంజుల తావక పద్యరత్నముల్
తొఁరగి విదేశభక్తి నినుఁ దొల్లిటియట్లు భజించుదాఁక నో
సరస కవిత్వకాంతరో! ప్రశాంతముగా సుఖసుప్తి నందుమా.

అరసిక లెందఱో యిపుడు నల్పసుఖంబులకోసు మోస నిన్
దరియక నిందచేయుచును దల్లిని నిన్నుఁ బరాభిలాషులై
కర మలసుల్ కుబుద్ధులయి కావున వారికిఁ దూరమౌచు నో
సరసకవిత్వ కాంతరో! ప్రశాంతముగా సుఖసుప్తి నందుమా.

# కీ. శే. కళాప్రపూర్ణ డా. చిలుకూరి నారాయణరావుగారి ఆంధ్ర భాషా సేవ

— శ్రీ డా. జి యస్. మోహన్.

ఆంధ్రమాత ప్రసవించిన అనుంగు బిడ్డల్లో కీ. శే. కళాప్రపూర్ణ, మహామహోపాధ్యాయ డా చిలుకూరి నారాయణరావు గారొకరు. వీరి ఆంధ్రభాషా సేవ అనన్య సామాన్యమైంది. ఇట్టి మహనీయుని సంస్మరించుకోవడం ఆంధ్రుల కనీస ధర్మం. వారిని గురించి, వారి రచనలను గురించి దిఙ్మాత్రంగా ప్రదర్శించడమే ఈవ్యాస ప్రధానోద్దేశం.

డా. చిలుకూరి నారాయణ రావుగారి జన్మస్థలం విశాఖపట్నం మండలంలోని పొందూరుకు సమీపంగా ఉన్న ఆనందపుర గ్రామం. అయినా వీరు తమ జీవితకాలంలో ముప్పాతిక భాగం రాయలసీమలోని అనంతపురంలోనే గడిపారు.

వీరి జననం 1890లో విద్యాభ్యాసం శ్రీకాకుళంలోని మున్సిపల్ హైస్కూల్ లోనూ, పర్లాకిమిడి రాజావారి కళాశాలలోనూ, విజయనగర మహారాజావారి కళాశాలలోనూ జరిగింది. మద్రాస్ విశ్వవిద్యాలయంలో తెలుగు, కన్నడభాషలు రెండింటిలోను ఎం. ఏ పట్టాన్ని స్వీకరించారు. తర్వాత ఎల్. టి. అయ్యారు. పదకొండో శతాబ్దంలోని తెలుగు రచనమీద పరిశోధన చేసి పిహెచ్. డి. పట్టాన్ని సంపాదించుకొన్నారు. ప్రప్రథమంగా తెలుగులో పరిశోధన గావించిన కీర్తి వీరికే దక్కింది. ఈనాటి పరిశోధకులకు పితామహులుగా ప్రస్తుతి కెక్కిన విద్వత్కవి పండితులు డా. చిలుకూరి నారాయణ రావుగారు.

డా. రావుగారు ఇంగ్లీషు బోధనా విధానాన్ని ప్రచారం చేయడానికై జె. ఏ. యేట్సు దొరగారితో కలిసి కొంతకాలం పాఠశాల పరీక్షకులుగా ఉండి ఉత్తర సర్కారు జిల్లాల్లో పనిచేశారు. రాజమహేంద్రవర ప్రభుత్వ కళాశాలలో కొంతకాలం పనిచేసి తర్వాత అనంతపురం ప్రభుత్వ కళాశాలలో చిరకాలం ఆంధ్రోపన్యాసకులుగా ఉండి అనంతపురంలోనే ఆత్రేయాశ్రమవాసులై 12-6-1952 లో తనువు చాలించారు.

అనంతపురం కళాశాలలో ఉత్తమ అధ్యాపకత్వాన్ని నిర్వహించి విద్యార్థుల ఆదరాభిమానాలను చూరగొన్న పండితవరేణ్యులు డా. రావుగారు. వీరు సంస్కృతాంధ్ర కర్ణాట భాషల్ని బోధించేవారట. వీరికి ఈభాషల్లోనే కాక తక్కిన ఇతరభారతీయ భాషలతో పాటు ఆంగ్లంలోనూ మంచి పాండిత్యముండేది.

డా. రావుగారు ప్రసిద్ధ పరిశోధకులు, ప్రఖ్యాత విమర్శకులు, ఉత్తమ అనువాదకులు, గొప్పనాటక కర్తలు. గిడుగువారి అడుగుజాడల్లో నడచిన వ్యావహారిక భాషావాదులు. ఆంధ్ర బెర్నార్డ్ షా బిరుదాంకితులు. శతాధిక గ్రంథకర్తలు. కథలు, నాటకాలు, జీవితచరిత్రలు, భాషాచరిత్రలు, పద్యకావ్యాలు, గేయాలు మరెన్నింటినో చేపట్టి సమగ్రముగా నిర్వహించిన దిట్ట. మతం, ధర్మశాస్త్రం, సారస్వతం, విద్యావిధానం ఇత్యాదులను చేపట్టి 1,25,000 పుటలు కల్గిన 240 గ్రంథాలను వెలయించారు. ఉపనిషత్తులు, భగవద్గీత, అథర్వవేదం, ఖురాన్ షరీఫు ఇత్యాదులకు వ్యాఖ్యానాలు వ్రాశారు. ఇవిఅన్నీ ఒకఎత్తు, కాల్డ్వెల్ సిద్ధాంతాన్ని ఖండిస్తూ వీరు రచించిన 'ఆంధ్రభాషాచరిత్ర' సంపుటాలే ఒకఎత్తు, వీరి భాషాచరిత్ర సంపుటాలు వీరి పరిశోధనా సామర్థ్యానికి, పాండిత్య ప్రకర్షకీ, అవిరళమైన కృషికి గీటురాళ్ళు. భాషాతత్త్వ పరిశోధనలో మొట్టమొదట కృషి చేసినవారు డా. రావుగారు. 'ఆంధ్రభాషా చరిత్ర' సంపుటాలను (రెండు) 1937లో ఆంధ్ర విశ్వవిద్యాలయంవారు ప్రకటించారు. ఇందులో వీరు ఆంధ్రసంస్కృతాలకు జన్యజనక సంబంధం ఉందని నిరూపించడానికే యత్నించారు. ఈ సంపుటాలకు విపులమైన పీఠిక వ్రాశారు. ఆంధ్రభాష, ఆంధ్రానికి సంబంధించిన ఉపభాషలు, తెనుగు, తెలుగు పదాల వ్యుత్పత్తి విచారం, తెనుగుకు సంబంధించిన మాండలిక భాషలు ఇత్యాదుల్ని ఉపోద్ఘాతంలో చర్చించారు. కాల్డ్వెల్ వాదం, దానికి వారిచ్చిన సమాధానం, ద్రావిడ భాషల్లో తెనుగకీయదగ్గ స్థానం ఇత్యాదుల్ని క్షుణ్ణంగా వివరించారు.

అలాగే సంస్కృత ప్రాకృతాలకు తెలుగుకు ఉండే సంబంధం, సంస్కృత ధ్వనులకు ప్రాకృతధ్వనులకు ఉండే సంబంధం, తెనుగు ధాతువులకు సంస్కృత ప్రాకృత ధాతువులకు ఉండే సంబంధం, ఆంధ్రలిపి, ఆంధ్రలిపి సంస్కారం, ఆంధ్రధ్వనులను గూర్చిన సుదీర్ఘ చర్చ, సంస్కృత, ప్రాకృత, ద్రావిడ భాషల్లో సంధులు మొదలైన వానినన్నిటినీ సోదాహరణంగా వివరించారు. గ్రంథం చివర మూడు అనుబంధాల్ని చేర్చారు. 'అనంతపురం జిల్లాలోని గ్రామ నామధేయాలను గురించిన మీమాంస' 'తెనుగున నావిక పదజాలము' తమ తర్వాత పిహెచ్ డి. చేయబోయే వాళ్ళకి కావలసినంత సామగ్రిని చేకూర్చారు. మార్గదర్శకులైనారు. ఈగ్రంథం భాషాతత్త్వ పరిశోధకులకు నేటికీ ఉపాదేయ గ్రం

థంగా మిగిలి ఉండడం హర్షించదగ్గ విషయం.

డా. రావుగారి గ్రంథాలలో అచ్చయిన వానిని కొన్నింటినిఉదాహరిస్తాను. అథర్వవేదం, భగవద్గీత, ఆపస్తంబ ధర్మసూత్రాలు, గౌతమ ధర్మసూత్రాలు, మనుస్మృతి, అశోకుని ధర్మశాసనాలు, కురాన్ షరీఫు (- ఇది మహమ్మదీయుల మత గ్రంథం. భారతీయ భాషలలో ప్రప్రథమంగా ఆంధ్రభాషలో అనువదించ బడ్డ అపూర్వ గ్రంథం), ఆంధ్ర భాషా చరిత్ర రెండు సంపుటాలు, గుజరాతీ వాఙ్మయచరిత్రం, Songs of Tyagaraja, The Dance of the Rain Drops (పిఠాపురం యువరాజావారి 'చినుకుల చిందులు' పద్యాలకు అనువాదం), జర్మనీ దేశ విద్యావిధానం - సంపూర్ణవర్ణన, ముసలమ్మపదం, పిల్లల పాటలు, ప్రాచీన విద్యాపీఠములు, University exercises in Translations ఇత్యాదులేకాక నాటకాలుకూడా అచ్చయ్యాయి. అవి 1. అంబ లేక మొండి శిఖండి -ఇందులో వీరభయానక బీభత్సాలతో పాటు హాస్యరస పోషణ చక్కగా చేయబడింది. ఆంధ్ర వ్యావహారిక భాషా పితామహులైన రావుసాహెబు గిడుగు రామమూర్తి పంతులుగారికి సమర్పించబడింది. 2. అశ్వత్థామ ఇది విషాదాంత నాటకం, కరుణ బీభత్సాలకు ఆలవాలం. 3. అచ్చి లేక కాపువలపు - ఇది సాంఘిక నాటకం, సామాన్యుడు మొదలుకొని రాజు ద్వారా శృంగారాది రసాల చిత్రీకరణ జరిగింది. సంఘ దురాచారాలు హాస్య రసం ద్వారా నిరూపించ బడ్డాయి. 4. పెండ్లి-ఆధునికాళయాలకు, ప్రాచీనాచారాలకు గల సంఘర్షణ చిత్రించ బడింది. ఇందులోనూ హాస్యరస ప్రధానం. 5. వాదే - ఇది అపరాధ పరిశోధక నాటకం. 6. నాటక నాటకం లేక బొగ్రయ్య సెట్టి - ఇదికూడ హాస్య ప్రధానం 7. తిమ్మరుసు - ఇది చారిత్రక నాటకం వీనిలో కొన్నింటిని డా. రావు గారు తమ విద్యార్థులచే ప్రదర్శింప చేశారు.

వీరు గ్రంథరచనల్తోనే తృప్తిపడకుండా అఖిలాంధ్ర కర్నాటక ప్రాంతాల్లోనూ, ఉత్తర భారతదేశంలోనూ పర్యటించి, అఖిలభారత మహాసభల్లోనూ పాల్గొని తెనుగు భాషా వైశిష్ట్యాన్ని ఉగ్గడించారు. అనేక సంస్థలకు వ్యవస్థాపకులుగా ఉన్నారు. రాజమహేంద్రవరంలో 'ఆంధ్ర దేశీయేతిహాస పరిశోధక మండలి'కి అధ్యక్షులుగా ఉండి తాము సేకరించిన కొన్ని వందల గ్రంథాల్ని, శిలాతామ్ర శాసనాల్ని ఆ మండలికే అర్పించారట. ఇట్టి ఉదార హృదయులు ఏకొద్దిమందో! నవ్యసాహిత్య పరిషత్ వ్యవస్థాపకులై అధ్యక్షులుగా ఉండి చాలాకాలం దాన్ని నడిపించారు. రాయలసీమలోని శ్రీకృష్ణ దేవరాయ విద్యాపీఠ సంస్థను స్థాపించి, అధ్యక్షులుగా ఉండి రాయలసీమ అభివృద్ధికి ఎంతో కృషి చేశారు. 'రాయలసీమ' నామకరణ విషయంలో కూడ వీరు ప్రధానపాత్ర వహించారట.

'ది రాయల్ ఏసియాటిక్ సొసైటీ' 'ది జర్మన్ ఓరియంటల్ సొసైటీ' 'ది అమెరికన్ ఓరియంటల్ సొసైటీ'లకు సభ్యులుగా ఉన్నారు. ఆంధ్ర, మైసూరు విశ్వవిద్యాలయాలకు 'Chairman, Board of Studies' గానూ, ఆంధ్రమద్రాస్ విశ్వవిద్యాలయాలకు 'Chairman, Board of Examiners' గానూ ఆకాలంలోనే పని చేశారు.

డా. రావుగారు ఆంధ్రదేశంలోని పెక్కుమంది కవుల్ని పండితుల్ని ప్రోత్సహించారు. వాళ్ళ చే కావ్యాలను వ్రాయించారు. తాము ఆ కావ్యాలకు పీఠికల్ని వ్రాసి వెలుగులోనికి తెచ్చారు. పాల్కురికి సోమనాథుని శ్రీ పండితారాధ్య చరిత్రను సంస్కరించి, దానికి విపులమైన పీఠికని రచించారు. సోమనాథుని దేశకాలాదుల్ని గురించి చర్చించారు. 348 పుటలు కల్గిన ఈ ఉపోద్ఘాతం ఎన్నో క్రొత్తవిషయాల్ని అందించింది.

జానపద సాహిత్యంలోనూ కృషిచేసి ఎన్నో జానపద గేయాలను సేకరించారు. శ్రీకాకుళంలో ఉండగా పడవపాటలెన్నింటినో వీరు సేకరించారు. లక్షకు పైగా సామెతల్ని సేకరించారు. వీరి భాషాసాహిత్య సంబంధమైన వ్యాసాలు అనేక ప్రముఖ పత్రికల్ని అలంకరించాయి.

డా. నారాయణ రావుగారి బహుముఖ ప్రజ్ఞను గుర్తించిన నాటి బ్రిటిషు ప్రభుత్వం 1947 వ సంవత్సరం జూన్ నెలలో 'మహామహోపాధ్యాయ' బిరుదును ప్రసాదించింది. అయితే నాటి ఇండియా ప్రభుత్వం పరప్రభుత్వాలిచ్చే బిరుదుల్ని నిషేధించడం వల్ల వారు దాన్ని స్వీకరించలేరు. అదే సంవత్సరం నవంబరు మాసంలో కాశీ సంస్కృత విద్యాపీఠం వారు 'మహామహోపాధ్యాయ' బిరుదాన్నిచ్చి గౌరవించారు, ఆంధ్ర విశ్వకళా పరిషత్తు వారు 'కళాప్రపూర్ణ' బిరుదాన్నిచ్చి ఘనంగా సన్మానించారు

ఈ విధంగా డా. రావుగారు కవిగా, పండితుడుగా, విమర్శకుడుగా, పరిశోధకుడుగా ఆంధ్రభాషా సాహిత్యాలకు ఎనలేని సేవచేసి, జీవితాంతం ఆంధ్ర శారదను ఆరాధించి శాశ్వతమైన కీర్తిని గడించారు. అట్టి మహనీయునకివే నమోవాకములు.

—...—

# శ్రీమద్రామాయణ కల్పవృక్షము

— శ్రీమతి చన్నాప్రగడ జయలక్ష్మి, ఎం. ఏ



శ్రీమద్రామాయణ కల్పవృక్షము కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారి సకలోహావైభవసనాథము. రామాయణము ప్రాతవానిలో నెల్ల ప్రాతది. వేదముల తర్వాత రామాయణమే అత్యంత ప్రాచీన వాఙ్మయము. లౌకిక వాఙ్మయములో ప్రపంచమునకే అది ఆదికావ్యము. వాల్మీకి రామాయణము నాధారము చేసికొని సంస్కృతములోను ఇతర భాషలలోను లెక్కకు మిక్కిలియైన కావ్యములు వెలువడినవి. రామకథాశ్రిత కావ్యములు తెలుగులో కూడ అసంఖ్యాకములు వచ్చినవి. అట్టి రామాయణమునే తిరిగి విశ్వనాథవారు రచించుటలో విశేషమేమి? 'పాడినదే పాడరా పాచిపండ్ల దాసరీ' అన్నట్లే యుండునుగదా. దీనికి విశ్వనాథవారు ఒకవిధముగా నిట్లు సమాధానమిచ్చియున్నారు.

'మరల నిదేల రామాయణం బన్నచో
  నీప్రపంచక మెల్ల నెల్లవేళఁ
దినుచున్నయన్న మే తినుచున్న దిన్నాళ్ళ
  తనరుచి బ్రతుకులు తనవిగాన
చేయుసంసార మే చేయుచు నున్నది
  తనదైన యనుభూతి తనదిగాన
తలఁచినరాము నే తలఁచెద నేనును
  నాభక్తి రచనలు నావిగాన'

'లోకము పుట్టినదాదిగ అందరును అన్నమును తినుచునే యున్నారు గనుక నేను తినకుండ మానుదునా? లోకములో అందరును పెండ్లాడి సంసారములు చేయుచున్నారు గనుక నేను పెండ్లి సంసారములు మానుకొందునా? నా ఆకలితీరుటకు, నేను బ్రతుకుటకు నేనును అన్నము తినవలసినదే. నా సుఖానుభూతి కొరకు, నావంశము కొనసాగుటకు, నేనును పెండ్లి చేసికొనవలసినదే. సంసారము చేయవలసినదే. అట్లే లోకములో ఎందరో రామకథను రచించియుండవచ్చును. వారు ధన్యులైనారు. మరి నాభక్తి చరితార్థమగుటకు నేను మాత్రము రామకథను చెప్పికొనవలదా?

ఇది విశ్వనాథవారు రామభక్తులుగా, ముముక్షువులుగా చెప్పిన సమాధానము. ఇది కవితారసికులకు తృప్తి నొసగజాలదు.' ఇది విశ్వనాథవారి వ్యక్తిగతకారణము. వారి భక్తిభావ చారితార్థ్యమునకై చెప్పికొనిన దానిని మేమేల చదువవలెను?' అందురు కావ్యరసజ్ఞులు. వారి కొరకై విశ్వనాథవారు మహాకవిగా చెప్పిన సమాధానమిట్లున్నది.

'కవి ప్రతిభలోన నుండును గావ్యగతశ
తాంశములయందుఁ దొంబదియైన పాళ్ళు;
ప్రాగ్విపశ్చిన్మతంబున రసము వేయి
రెట్లు గొప్పది నవకథాదృతిని మించి.'

కథయొక్క ప్రాతక్రొత్తలు ప్రధానము కావు. కావ్యరజ్ఞులు కావ్యమును చదువునది కేవలము కథకొరకు కాదు. వారికి రసము ప్రధానము. ఆరసపోషణము కవిప్రతిభపై ఆధారపడియుండును. కనుక ఒక కావ్యముయొక్క యోగ్యత నూటికి తొంబది వంతులు కవిప్రతిభపై ఆధారపడి యుండును. ఈ ప్రతిభ విశ్వనాథవారిలో పరాకాష్ఠ నందుకొన్నది. ఆ విషయమును లోక మెరుగును. వారును ఎరుగుదురు. కనుకనే 'అలఘు స్వాదు రసావతారధిషణావాంకారసంభార దోహల బ్రాహ్మీమయమూర్తి' నని ఆత్మప్రశంసభీతి లేకుండ చెప్పికొనగలిగినారు.

ప్రతిభ యనగా నేమి? నవనవోన్మేషశాలినియైన ప్రజ్ఞయే ప్రతిభ యనబడును.' ఎప్పటి కప్పుడు నిత్యనూతనముగా వికాసము చూపగల శక్తియే ప్రతిభ. 'అపూర్వవస్తునిర్మాణక్షమమైనదే ప్రజ్ఞ.' ఇంతకు పూర్వములేని వస్తువును నిర్మింపగల నేర్పే ప్రజ్ఞ. లేక శక్తి. మరి ప్రాతలలో ప్రాతదైన రామకథనే వస్తువుగా స్వీకరించిన విశ్వనాథవారి ప్రతిభ యెట్టిది?

నూతనవస్తువుతో కూడిన కావ్యమందైనను కవి కూర్చునది ప్రాత అక్షరములనేకదా. ప్రాతబడిన పదములనే కదా. 'అవే ప్రాతపదవిన్యాసములు, అవే ప్రాత అర్థసంపదలు. అయినను కవియొక్క గ్రథనకౌశలమువలన కావ్యము నూతనముగా భాసించుచున్నది.' కథ ప్రాతదేయైనను, అందులోనే క్రొత్తదనమును చూపించుటయందే యున్నది కవిప్రతిభ. ఇది యెట్లు సాధ్యము? ఇంతకంటె క్రొత్తకథను చెప్పుటయే సులభము. దీనిని నాటకకర్త లొక విధముగా సాధించిరి. పురాతన కథలనే ఇతివృత్తములుగా స్వీకరించియు, వానిలో తమ అభిరుచి ననుసరించి మార్పులు గావించి, క్రొత్తకథలుగా రూపొందించినారు. 'నాయకునకుగాని, రసమునకుగాని అనుచితముగాని, విరుద్ధముగాని యైన కథాంశమును విడువవచ్చు. లేదా మరియొక విధముగా కల్పింపవచ్చును.' అని శాస్త్రకారులు నాటకకర్తలకు అనుమతి నొసగియున్నారు. కాని విశ్వనాథవారి పరిస్థితి దీనికి భిన్నమైనది. వారు వ్రాయబూనినది నాటకము కాదు, శ్రవ్యకావ్యము.

విశ్వనాథవారికి వాల్మీకియెడఁ గల భక్తి అనన్యము.

'ఒక్క వాల్మీకిగాక వేఱొక్కఁ డెవఁడు
సుకవిశబ్దవాచ్యుండు?'

అని వారి అభిప్రాయము.

'సర్వశిల్పభూమి, సర్వలక్షణ లక్ష్య
నవవిధాతృభూతుఁడు నా వజాతుఁడు'

అని వారి నిష్కర్ష.

'ఈసంసారమదెన్నిజన్మలకుఁ గా
నీ మాని వాల్మీకి భా
షాసంక్రాంత ఋణంబుఁదీర్పఁగలదా?
సత్కావ్యనిర్మాణ రే
ఖాసామగ్రిఋణంబుఁ దీర్పఁగలదా?'

అని వారి ప్రశ్న. కనుకనే

'అచ్చమైన యమృత మమరులు త్రావినా
రోయి! దానికే వసూయపడను;
పరమమానిరైన వాల్మీకి కృతరామ
సత్కథా సుధారసంబు ద్రావి.'

అని వారు సంతృప్తి చెందినారు. వాల్మీకి సత్కవితాసుధను ఆకంఠముగ [illegible]

అట్టి వాల్మీకి కావ్యములో అనౌచిత్యముగాని, విరుద్ధముగాని ఒకటి యుండగలదను ఊహాయే విశ్వనాథవారి విషయమున ఊహింపరానిది. మరి యిక క్రొత్తదనమును సాధించు టెట్లు?

ఇది యొక చిక్కుప్రశ్న.

విచారింపగా ఈప్రశ్నకు సమాధానము విశ్వనాథవారికి వాల్మీకి యెడఁగల అభిప్రాయములోనే దొరకుచున్నది. విశ్వనాథ దృష్టిలో వాల్మీకి 'సర్వశిల్పభూమి, సర్వలక్షణ లక్ష్య నవవిధాత్మభూతుడు. మరి విశ్వనాథవారు 'కావ్యస్యాత్మాధ్వనిః' అను మతములోనివారు. కవితాశిల్పమునకు పరాకాష్ఠధ్వని యని వారి తాత్పర్యము. అట్టి ధ్వని వాల్మీకి కావ్యములో నిండారియున్నది. రామాయణమువంటి ధ్వని కావ్యము 'నభూతో నభవిష్యతి.' రామాయణము గొప్పధ్వని కావ్యమని గుర్తించిన మొదటివారు ఆనందవర్ధనాచార్యులు. రెండవవారు విశ్వనాథవారు. అది అంతగొప్పధ్వని కావ్యం కనుకనే 'కొన్నిజన్మ లెత్తినా వాల్మీకి రామాయణం అర్థంకాదు' అని విశ్వనాథవారు అన్నారు. మరి విశ్వనాథవారు ఎన్నిజన్మలుగా వాల్మీకమును అధ్యయనముచేసినారో!

'అరయఁగ నూహశక్తి తన
యంతన తాను ఘటిల్లునో? పురా
భరితమనంత సంసృతి కు
భంబునఁ జేకుఱఁగాక, యట్లుచే
కుఱిన శుభంబులోడ నొనఁ
గూడిన పూర్వపుఁ బున్నెమాదుకో
స్ఫురణ ఘటిల్లు ...'

అనివారే మరొకసందర్భములో చెప్పియున్నారు. ఈజన్మలోకూడ వారు ఎన్ని సంవత్సరములో రామాయణమును భక్తిశ్రద్ధలతో అధ్యయనము చేసియున్నారు. [illegible] రామాయణకల్పవృక్షం' అని వారే చెప్పికొని యున్నారు. కనుకనే 'వాల్మీకిని గురించి నాకు తెలిసినంతగా మరెవ్వరికీ తెలియదు.' అని ధైర్యంగా చెప్పికొనగల్గినారు.

తమ రామాయణరచనను గురించి 'కవిత్రయం పోతన్నలవంటి మహానుభావుల దారిలో వ్రాసాను.' అని విశ్వనాథవారు చెప్పియున్నారు. వారి దారి యెట్టిది? ఆ మహాకవుల గ్రంథములు కేవలానువాదములు కావు. అవి ఒక విధముగ స్వతంత్రకావ్యములు. ప్రతిసృష్టులు. మూలగ్రంథములకు రసవద్వ్యాఖ్యలు. అట్లే రామాయణ కల్పవృక్షము కూడ వాల్మీకమునకొక రసవద్వ్యాఖ్య. 'రామాయణ కల్పవృక్షం వాల్మీకిగ్రంథానికి భాష్యం. 'నాకల్పవృక్షం సకలార్థప్రదం.' అని విశ్వనాథవారు చెప్పినదాని అర్థమిది.

వాల్మీకిమహర్షి లోకోత్తరమైన తన ధ్వనికావ్యములో ఎన్నియో రమణీయార్థములను నిక్షిప్తము చేసియున్నాడు. అవి సాధారణ పాఠకుని దృష్టికి తగులునవి కావు. విశ్వనాథవారు తమ ఆర్ష దృష్టితో వానిని గుర్తించి ప్రతిభాఖనిత్రముతో ఆ ఖనిని త్రవ్వి అనర్ఘభావరత్నములను వెలికితీసి ఆంధ్రసారస్వత రసజ్ఞులకు పంచిపెట్టినారు.

వాల్మీకికి విశ్వనాథవారు చేసిన వ్యాఖ్యానములు అతినవ్యములు. అవి వారి నవనవోన్మేషశాలినియైన, అపూర్వవస్తునిర్మాణక్షమమైన ప్రతిభచే సముత్థితములు. ఈదృష్టితో చూచినచో ప్రాతకథనే క్రొత్తగా చెప్పుట యననేమో అవగతము కాగలదు.

వాల్మీకిరామాయణములో స్థూలదృష్టికి అనన్వితములుగ కన్పించు సందర్భము లనేకములున్నవి. వీనిని సమన్వితము గావించుటకు సూక్ష్మదృష్టి యవసరము. నేడు రామాయణముపై చెలరేగుచున్న ప్రతికూల విమర్శలకిసూక్ష్మదృష్టి లోపించుటయే కారణము. తన సూక్ష్మేక్షికతో దర్శించిన సమన్వయ సత్యమును లోకమునకు వెల్లడించుట విశ్వనాథవారు లక్షించిన ప్రయోజనము. కనుక రామాయణ కల్పవృక్షము గోవిందరాజీయము వంటి కేవల వ్యాఖ్యానగ్రంథము కాదు. అది యొక కావ్యము. కనుకనే విశ్వనాథవారి వ్యాఖ్యానముకూడ కావ్యమార్గమననే వ్యంగమర్యాదలోనే చేయబడినది. ఆవ్యాఖ్యాన స్వరూపమును గుర్తించుటకును కొంత సూక్ష్మేక్షిక అవసరమేమరి.

ఒకటి రెండు ఉదాహరణములను ప్రదర్శింతును.

(సశేషం)

# 'స్వయంవరం' కావ్యం - జాషువా కథాకథనం

-- శ్రీ బి. కే.

స్వతంత్ర భావ సంపన్నుడైన మహాకవి లోకం మెప్పుకోసం తన భావాల్ని చంపుకోడు. లోకానికి మైమరపు కలిగించే భావాల్ని చెప్పి తన అవసరాల్ని తీర్చుకోవడానికి ప్రయత్నించడు. లోకానికి తన భావాలు అయిష్టంగా ఉన్నా నిర్భీతిగా వెల్లడించి సమాజాన్ని సన్మార్గానికి మరలించడానికి తన కవిత్వాన్ని వినియోగిస్తాడు. ఒకమాటలో చెప్పాలంటే వ్యవస్థతో రాజీపడి స్వేచ్ఛా భావాల్ని చంపుకొనేవాడు మహాకవి కాలేడు_ జాషువా స్వతంత్రప్రవృత్తిగల మహాకవి. తనకి నచ్చని ఏవిషయాన్నైనా విమర్శించి లోకంముందు పెట్టడానికి ఆయన ఎప్పుడూ జంకలేదు. జాషువా కాలానికి అభ్యుదయభావాల పేరిట సమాజాన్ని విమర్శించే రచనలు ప్రాముఖ్యాన్ని పొందసాగినాయి. సాంప్రదాయికంగా పద్యాల్ని రచించే జాషువ అభ్యుదయ భావాల్ని పద్యంరూపంగానే రచించాడు. చుట్టూఉన్న సమాజంలో అభ్యుదయ మార్గానికి అడ్డంగా నిలచిన సర్వ విషయాల్ని విమర్శించాడు. ఆయన ఈ అభ్యుదయ మార్గంలో 'స్వయంవరం' కావ్యం ప్రశంసనీయమైనది.

గాంధీ మహాత్ముని అహింసావిధానం చేత మనదేశంలో పర పరిపాలన అంతమయింది. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత సర్వవిషయాల్లోనూ దేశం పురోగమించింది. దారిద్ర్యం అంతరించింది. ఉత్తమభావాలు వికసించి గాంధీమహాత్ముని మార్గం సంపన్నంకాగలదని అందరూ ఆశించారు. జాషువాకవి కూడ గాంధీ మహాత్ముని మార్గంమీద అచంచల విశ్వాసం గలవాడు. కాని స్వాతంత్ర్యం వచ్చిన తరువాత ఆస్వాతంత్ర్యాన్ని తమ స్వార్థానికి ఉపయోగించుకొని దేశాన్ని ఇంకా అధోగతి పాలుచేసే దోపిడీదార్లని, దుర్మార్గుల్ని, చూచి జాషువ సంతప్తచిత్తంతో విలపించాడు. క్రోధమూర్తియై కపించాడు. అతని ఆవేదనలోంచి, ఆవేశంలోంచి ఈ స్వయంవరకావ్యం రూపు దిద్దుకొన్నది. స్వాతంత్ర్యానంతర తిరోగమన భావాలన్నీ ఈ కావ్యంలో విమర్శించబడినవి. రాజకీయంగా, సాంస్కృతికంగా, మతపరంగా, చెలరేగిన భావమాలిన్యమంతా ఈకావ్యంలో ఖండించబడింది. ఈసామాజిక కావ్యాల్లో స్వయంవరం అత్యుత్తమ అభ్యుదయరచన.

సాధారణంగా అభ్యుదయ సామాజిక భావాల్ని చెప్పేటప్పుడు కవితా శిల్పం కవులు అంతగా పాటించకపోవడంకద్దు. కాని జాషువ ఈకావ్యంలో ఒక గొప్ప శిల్పాన్ని ఆద్యంతము అనుసరించాడు. సంకేత పద్ధతిలో తన భావాల్ని (Symbolism) వెలువరించడం ఈ కావ్యం ప్రత్యేకత. ఇందులో స్వాతంత్ర్యం అనేది ఒక స్త్రీగా సంకేతింపబడింది. ఈమె పరహస్తగత కాగా ఒకకులభేదము, మతభేదము కలికమునకు లేనివాడు, కలకండముతో తులతూగువాడు సత్యసూక్తులు పలుకువాడు ఆమెను పరహస్తాల్నించి తిరిగిపొందాడు. అతడే జాషువ భావంలో గాంధీ మహాత్ముడు. గాంధీ మహాత్ముని లక్షణాగణనతోనే కావ్యం ప్రారంభించబడింది. దేశమాతకి ఆయన కుమారుడుగా చెప్పబడ్డాడు. దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించిన ఏడునెలలలోనే గాంధీమహాత్ముడు హత్యచేయబడ్డాడు. ఆవిషయాన్ని జాషువ ఇట్లా చెప్తాడు.

'నిసుగున కీడు మాసములు
నిండియునిండక ముందె పాపమా
మొగలిని పొట్టబెట్టుకొని
పోయె నాకానాక పుణ్యమూర్తి, త
ద్వ్యసనవినీల నీరదమ
హాంధతమస్సు విశాల విశ్వమున్
ముసరి, చరిత్రలో గరిగి
పోసె నఖండ కళంకపంకమున్'

ఇక్కడ జాషువ వ్యాఖ్యానం మతోన్మాదం, మానవత్వాన్ని నాశనం చేసిందని.

'హత్యకగ్గమైన యమ్మహాత్మునకునై
చిన్న బాష్పకణము జిమ్మనయ్యె
పారమార్థ మద్యపానంబు గావించి
మత్తుగొన్న కఠిన మతముకన్ను'

గాంధి అదృశ్యంకాగానే ఆయన అణచివుంచిన దుష్ట సంప్రదాయాలన్నీ మళ్ళీ తలఎత్తడం ప్రారంభించినవి.

'కులమతత్వములు పుంజుకొని
తలయెత్తెన్'

అంటాడు కవి స్వాతంత్ర్యం కన్న ఇష్టానిష్టాలన్నీ కవి విపులంగా వర్ణిస్తాడు. ఇక్కడ పరోక్షంగా కవి చెప్పదలచుకున్న దేమంటే ఆమెకు ఇష్టమైన విషయాలు దేశంలో నిజమైన స్వాతంత్ర్యానికి మార్గాలు. ఆమె చీదరించుకొనే విషయాలు దేశదౌర్భాగ్యానికి హేతువులు.

ఉదా :-

'అనుభవమువిూద గుజరాతుమునివరుండు
వ్రాసిపోయిన ధర్మసూత్రములు చదివి
ఆటపాటల జెలికత్తెయలకు నేర్పు
చిలిపి సిద్ధాంత భాష్యముల్ చీదరించు

ఆమె 'విశ్వసించదు అల పెద్దలనాటి పిశాచధర్మముల్' పాతకాలంలోని దుస్సంప్రదాయాల్ని రోసి ఆధునికతను ప్రచారంచేసిన పద్యకవుల్లో జాషువాది ప్రత్యేకస్థానం. ఒక స్త్రీ కథని రసవంతంగా వర్ణిస్తూ పరోక్షంగా దేశాన్ని

జాషువ వర్ణిస్తున్నాడు కాబట్టి ఒకొక్కచోట సంపూర్ణమైన సాంకేతికత్వం సమన్వయించాడు. కథాపద్ధతిలో సామాన్యుణ్ణి చెప్పదలచాడు కాబట్టి ఇట్లాంటి సమన్వయ రాహిత్యం అనివార్యమౌతుంది.

ఉదా :-

ఆ బాలికకి యౌవనం వచ్చింది ఇక్కడ

'యువకభూపుల చిత్తంబు లూగియాడ
నంబుజాస్యకు యౌవన మంకురించె'

అంటాడు కవి. ఎవరీ భూపతులన్న పదానికి అన్వయం కష్టమౌతుంది. రసమయ వర్ణనకోసం ఆమెకి'

'మదగజయానమున్, మెరుపు
మాదిరిమేను, సరోజపత్ర సం
పదగల కంటిసొంపు' అమరినవి.

అంటాడు. ఇవన్నీ స్వాతంత్ర్యానికి అన్వయించలేము. కాని కథని చదివించడంలో ఈ వర్ణనలు అతి మనోహరములు.

ఆమెకి స్వయంవరం చాటించబడింది. ఈ ఘట్టం కావ్యంలో మణిదీపంలాంటిది. అసలు ఈ ఘట్టం కోసమే ఈ కావ్యం రచించబడింది అనడంలో సందేహంలేదు. రాజకీయంగా కుళ్ళిపోయిన దేశనాయకత్వాన్ని సాంస్కృతికంగా భ్రష్టమైన సంప్రదాయాల్ని, మానవత్వాన్ని అడుగడుగునా హత్యచేస్తున్న అమానుషత్వాన్ని కనితీరా ఈ సన్నివేశంలో జాషువా వర్ణించాడు. వచన రూపంలో పెడితే ఈ సన్నివేశం గొప్ప అభ్యుదయ కవిత్వం. అభ్యుదయకవిత్వంలో ఉన్న వ్యంగ్యం ఇక్కడ బాగా కనిపిస్తుంది.

'చెరసాలయినుపపంజరమందుమూన్నాళ్లు
గడిపిన ముద్రికల్ గలుగువారు
పోలీసులాఠీల పోటులు చవిజూచి
కాయలేర్పడ్డ యంగములవారు
రాట్నాలుగొనియింటరమణిమోముననైచి
విహరించు గాంధి టోపీలవారు
పావలాసభ్యులై ప్రక్కపాటుననుండి
వల్లదప్పిన నింటబడెడువారు
ఈగకాలు సోకనీకుండ నిజవర్ణ
రక్షణంబు గోరి బ్రతుకువారు
మరుగుపరచ నేల దొరలు దొంగలుగూడ
కూడిరెలమి పెండ్లికొడుకు లగుచు'

ఒకొక్క పెండ్లికొడుకులో ఒకొక్క దోపిడీదారుడు నిరూపించబడ్డాడు. ఏ దోపిడీదారుణ్ణీ జాషువ మరచిపోలేదు.

ఒకడు :-

'తెలవారేల్బడిసేయునా డితడు మం
త్రిత్వంబు సాధించి, యా
ప్తులకుం దగ్గరచుట్టపక్కములకు
ద్యోగంబు లిప్పించి, మా
న్యుల కన్యాయము చేసి నాడనుచు విం
దున్ వర్గవిద్వేషముల్
పులుసై, యెంతటి సత్కారముల గొం
తుల్ నొక్కి భక్షించెనో'

మరియొకడు :-

'అటకాయించెడు కాసనాల చెవుల
ల్లాడించుచున్ బ్లాకుమా
ర్కెటుసాగించు బెహారిమిన్న యితడా
ర్పెన్ పెక్కు సంసారముల్
జిటికెండంత దగాకరసంచితని కు
క్షిన్ జెల్చినన్ గాన మి
క్కుటిలుం డుత్తమదేశభక్తుడని ప
ల్కున్ బత్రికారాజముల్.'

ఇట్లా దోపిడిదారుల్ని వర్ణించడంలో నిజమైన దేశభక్తుల్ని మరచిపోలేదు.

" ... ... ... ధీరులై
'నిలిచిన శాంతిదూతల న
నింద్య చంద్రుల జూడుమమ్మకో
వలపుల కౌగిలింతలకు
వన్నెలు దేగల దేశభక్తులన్.'

ఆమె చూచింది. ఇక్కడ జాషువ వాళ్లెవర్ని ఆమె వరించలేదని వర్ణిస్తాడు. దోపిడిదార్లను సరే, గాంధేయులైన దేశభక్తుల్ని కూడ ఆమె ఇష్టపడలేదనడం అంతగా అన్వయించదు. కాని కథాగమనంలో ఈ అంశం కలిసిపోతుంది.

ఆమె తనకు తగిన వరుణ్ణి ఎన్నుకోవడానికి దేశాటనానికి బయలు దేరడం తరువాతి ఘట్టం. ఈ ఘట్టంలో జాషువ దేశపరిస్థితు లన్నిటిని వర్ణిస్తాడు. ఆ పరిస్థితులన్నీ చూచి ఆమె ఆవేదన పొందినట్లు వర్ణిస్తాడు. సాంస్కృతికంగా దేశాన్ని సుసంపన్నం చేసిన సంస్కర్తల్ని ఈ ఘట్టంలో స్మరిస్తాడు.

ఉదా :-

'స్త్రీలపాలిటి ప్రత్యక్ష దేవుడైన
రామమోహనరాయలు బ్రహ్మసమితి
కంకురార్పణచేయు దివ్యస్థలాలు
దర్శనము చేసికొని భామ తనివిఁజెందె'

భాషాభేదాలవల్ల యుద్ధాలు జరగడం కులమతద్వేషాలవల్ల హత్యలు చెలరేగడం వర్ణిస్తాడు. బీద, గొప్ప తారతమ్యాన్ని అభ్యుదయ రచయితగా ఇలా చెప్తాడు

" ... ... ... స్వరాజ్యమేదియో
'పెట్టిసముద్ధరించునను
వెఱ్ఱికిలోనయి, జీవితంబులన్
నెట్టువభాగ్యులం గనియె
నిండినబొజ్జలవారి పజ్జలన్'

ఈ ఘట్టంలో జాషువ ఒకశిల్పాన్ని ప్రదర్శించాడు. తాను ప్రత్యక్షంగా వర్ణించకుండా కొన్ని విషయాల్ని రాతిబొమ్మలైన దేవుళ్లు చెప్పినట్లు వర్ణిస్తాడు. దేవుడి పేరు చెప్పి సమస్తపాపకార్యములు చేసేవారిఁగూర్చి దేవునిరాతి బొమ్మలే చెప్పినట్లు వర్ణించడం ఉత్తమశిల్పం.

'హరిజనులచేతినైవేద్యమభిలషించు
వేలుపుల మగు మావిశ్వవిహితసమత
భ్రష్టమొనరించి రమ్మ! దైవములబ్రదుకు
కటకటా! నేడు సంశయగ్రస్త మయ్యె'

ఆరాతిబొమ్మలు చెప్పిన మాటలన్నీ వినగానే ఆమెకు కలిగిన ఆవేదన కవి తన నుడికారపు ప్రత్యేకతతో ఇట్లా చెప్తాడు.

" ... భామగుండె తెగి రెండయ్యెన్'

ఆమె తనకి తగిన వరుణ్ణి అన్వేషించడానికి చేసిన ప్రయత్నాలన్నీ నిష్ఫలమై

చివరికి హిమాలయప్రాంతానికి చేరుకుంటుంది. అక్కడ ఆమె చెలికత్తెలు ఆమెకు హితబోధ చేస్తారు. అవాతావరణాన్ని ప్రకృతి సౌందర్యాన్ని అక్కడి నిష్కల్మష నిర్మలజీవన విధానాన్ని విపులంగా వర్ణిస్తాడు. ఈ వర్ణన జాషువ భావకవితా లక్షణానికి ప్రతినిధిగా ఉంటుందేగాని కథాసందర్భానికి, సాంకేతిక రచనకి అంతగా అతుకుపడదు. ఆ తరువాత ఆమెకు హఠాత్తుగా గాంధీ మహాత్ముని పోలికలో ఉన్న ఒకవ్యక్తి కనిపిస్తాడు. అతడు.

కరము చెందుగాంధి కత్తివాదరమీది
కఠినతపము చేయగలుగువాని
హృదయమున్న వాని నీడుజోడగువాని
ప్రేమమీర భామ పెండ్లియాడె.'

అతణ్ణి ఆమె పరిణయ మాడుతుంది. ఇక్కడ జాషువ చెప్ప దలచుకొన్నది ఏమి టన్న ప్రశ్న జనిస్తుంది. ఋషి లక్షణములు గలవాడు కృత్రిమభావాలు లేని గిరిజనుల్లాంటి నిర్మల మనస్తత్వంగలవాడు అయిన ఒక మహానాయకుడు అవతరిస్తేనేగాని స్వాతంత్ర్యం రక్షింపబడదు అన్నది జాషువ అభిప్రాయం. రాజకీయంగా పరిశీలిస్తే ఉత్తమ లక్షణాలు గలవ్యక్తి ఒక్కడూ ఈ సమాజాన్ని మార్చివేయలేడన్నది వాస్తవం. అందువల్ల జాషువ చేసిన కథాంతకల్పన పూర్తి సంతృప్తిని కలిగించకపోవచ్చును. అయినా కథాకల్పన అత్యంతరమణీయం. ఆద్యంత కమనీయం.

ఈవిధంగా 'స్వయంవరం' కావ్యం వినూతనవిధానంలో రచింపబడ్డ ఆధునిక రచన. సమకాలిక రాజకీయాల్ని సాంకేతిక శిల్పంతో మేళవించి పద్యరచనా శిల్పంతో జోడించి అనితర సాధ్యమైన అభ్యుదయ పద్యకావ్యాన్ని నిర్మించిన జాషువ చిరస్మరణీయుడు.

—•••—

## మఱియొక నిరోష్ఠ్యరామాయణము –
## 'సీతారాఘవచరిత్రము'

— శ్రీ రంగాచార్య.

---

మనకు తెలిసినంతవరకు – తెనుగు సాహిత్యములో ప్రప్రథమముగా నిరోష్ఠ్యనిఘంటువుతో – దశరథ రాజనందన చరిత్రమును, నల్లగొండజిల్లాకు చెందిన అనూరి మరింగంటి సింగరాచార్యులవారు వ్రాసినారు. ఈ కవియే శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతాకల్యాణమును వ్రాసినాడు. శతఘంటావధాన బిరుదాభిరాముడైన యీకవి రచనలలో నీరెండే లభించుచున్నవి. 1971 సంవత్సరమున– నా పరిష్కరణతో – ఆంధ్ర ప్రదేశ సాహిత్య ఎకాడమీవారు – దశరథ రాజనందన చరిత్రను ప్రకటించిరి. ఇటీవల 1977 లో ఈ గ్రంథము ఎకాడమీ వారిచే పునర్ముద్రణ మందినది. నిరోష్ఠ్య సీతాకల్యాణము 1910 లో ముద్రిత మయినను– నేడు లభించుట లేదు. ఇది ముద్రణ నందవలసిన కృతి.

సింగరాచార్యుల వారి రచనతర్వాత – మన తెనుగుకవులు– నిరోష్ఠ్య రచనలను– మఱికొన్ని నియమములతో కూడా రచించిరి. మామూలు నిరోష్ఠ్యమేకాక – శుద్ధాంధ్ర నిరోష్ఠ్యము, దీనికి తోడు – నిర్వచనము – మొదలగు పద్ధతులతో – పరంపరగా రచనలు వెడలినవి. సాహితీ పరిచితుల కవి–పరిచితపూర్వములే (వీనిని గూర్చియు – సంస్కృతాంధ్రములలో నిరోష్ఠ్యరచనలను గూర్చియు – దశరథ రాజ నందనచరిత్ర పీఠికలో వివరముగా గలదు)

నిరోష్ఠ్య రచనలయందు దక్కువ భాగము– రామకథా పరములే. మొట్ట మొదటి నిరోష్ఠ్యరచనయే కాక – హెచ్చుభాగము నిరోష్ఠ్య రచనలు – తెలంగాణమునుండి వచ్చుట– విశేషము. దశరథతనయ చరిత్ర (ము) నిరోష్ఠ్య రామాయణము, నిరోష్ఠ్య కృష్ణ శతకము, నిరోష్ఠ్య నారాయణ సంఖ్య, అశ్వధాటీ వృత్తాలలో నిరోష్ఠ్య రామాయణము,– ఈవిధముగా మరిన్ని గలవు.

చిత్రకవితాశాఖకు చెందిన– నిరోష్ఠ్య సాహిత్యముపై – నేటి రచయితలకు గూడ అభినివేశ మున్నదనుటకు – ప్రబలోదాహరణము – ఇటీవల వెలువడిన – సీతారాఘవచరిత్రము. ఈ గ్రంథకర్త శ్రీ మోతుకూరి సత్యనారాయణగారు, నల్లగొండ జిల్లాలోని సూర్యాపేట వీరి నివాసము.

నేడు పద్యరచనయే కావిచిత్ర్యమైనది. అందును చక్కని పద్యములు తక్కువైనవి. ఇట్టి స్థితిలో – కాలానికి ఎదురీదినట్లు శ్రీ సత్యనారాయణగారు – రామకథను గైకొని నిరోష్ఠ్య నియమములో పద్యరచన చేయుట – ముదావహమైన విషయము. పాఠకుల కెట్లున్నను, రచయితకు మాత్రమిది – శ్రమైకసాధ్య మని ప్రత్యేకముగా చెప్పనవసరము లేదు.

ఈ గ్రంథము. 282 పుటలలో 1129 గద్యపద్యములుగలవు. ఎక్కువ భాగము – తేటగీతి, ఆటవెలది, గీతములున్నను, ఇతర వృత్తములు గూడ వ్రాయబడినవి. గ్రంథమును, కాండములుగా గాని, ఆశ్వాసములుగా గాని విభజింపలేదు. 869 వ పద్యము తరువాత 'ఉత్తరకాండ సీతారాఘవ చరిత్రము'– అను శీర్షిక గలదు.

ఈ పుస్తకమునకు సుగృహీత నామధేయులు, శ్రీ దివాకర్ల వెంకటావధాని

గారు 'తొలిపలుకు' వ్రాసినారు, 'ఆర్ష ధర్మ ప్రబోధక-' శ్రీ- నండూరి సుబ్రహ్మణ్యశర్మగారు - 'అభిప్రాయము'ను వ్రాసినారు. రచయితయైన సత్యనారాయణగారు - గ్రంథమును రామాంకితముగా నిచ్చుచు పద్యత్రయమును వ్రాసిరి. అనంతరము - వారే ప్రరచుకొనిననిరోష్ఠ్యనియమమునుగూర్చి తెల్పిరి- అది - ప-ఫ-బ-భ-మ, లపలుకు పల్కకుండగ, క్రమ యనక వ్రాసిన వాడ నర్కవంశ-' అని - బాగుగానేగలదు.

నిరోష్ఠ్యములైన యక్షరముల విషయములో లాక్షణికులయందు భేదాభిప్రాయములు గన్పడును.

అప్పకవి (4-552 లో)

పావన పాఫాబాభా
మావాయను నాలు లిపులు మఱిఁ
బద్యములో
భావింపఁ దొరలకుండిన
భూవలయమున న్నిరోష్ఠ్యము
పిసాలించున్.'

అని తెల్పి - దీని వెంటనేయొక ఉదాహరణపద్య మిచ్చెను. అప్పకవి మతములో - ప-ఫ-బ-భ-మ.వ- అనెవి మాత్రమే ఓష్ఠ్యాలు. (ప్రస్తుత గ్రంథకర్త 'వ' అను నక్షరమును నిరోష్ఠ్యముగా గ్రహించి ధారాళముగ ప్రయోగించినాడు)

సంస్కృత వ్యాకరణ నియమాను సారముగా-నివి ఓష్ఠ్యవర్ణాలు,

1) ఉ-ఊ-ప-ఫ-బ-భ-మ- ఉపధ్మానీయము.
2) ఓ-ఔ- కంఠోష్ఠ్యములు.
3) వ- దంతోష్ఠ్యము - 'బ' అనునక్షరము కు తెనుగున కంఠోష్ఠ్యముగనే పరిగణింప వలయును'

అక్షరోచ్చారణ సమయమున - మన ముఖములో ఏభాగము నుండి పుట్టి దేని సాయములో ఉచ్చారణజరుగునో -దానిని బట్టియే - ఈ భేదములు కల్గినట్లు మన మూహింప వచ్చును.

కావ్యాలంకారచూడామణి కారుడైన విన్నకోటపెద్దన మాత్రము -

పంచమ వర్గాక్షరములు
వంచించి హిలోచితార్థ వంతంబులు గా
వించిన కబ్బము - వీనుల
కంచితమై యది నిరోష్ఠ్య మన
నొప్పారున్ - (6-44)

అని తెల్పి-దీని వెంటనే (6-45) 'చాళుక్యక్షితినాథు-' ఇత్యాది పద్యము నుదాహరణముగా నిచ్చినాడు. 'వ' అను నక్షరము నితడు నిరోష్ఠ్యముగా భావించినను- తన యుదాహరణమున మాత్రమా యక్షరము రాలేదు. ఇక - కావ్యాలంకార సంగ్రహకర్త - 2-175 లో నిరోష్ఠ్య లక్షణమును దెల్పి - ఉదాహరణ మిచ్చుచోకాక - 'ఓష్ఠ్యనిరోష్ఠ్య సంకర'మున నిచ్చిన యుదాహరణము (4-39) నందు 'వ' ను ఓష్ఠ్యముగా గ్రహించెను. (ఈపద్యమున 8 'వ' లు గలవు) య,ర-ల-వ లంతస్థములు గదా! వకారము దంతోష్ఠ్యము గాబట్టి 'వ'ను ప్రస్తుత గ్రంథకర్త నిరోష్ఠ్యముగా గ్రహించినట్టున్నారు. (వ- అనునప్పుడు దంతములు పెదవులకు తగులును.) తెలుగున నిరోష్ఠ్య రచన చేసిన యేకవియును 'వ'ను (నిరోష్ఠ్యముగా) గ్రహించినట్లులేదు)- వివరములకు - దశరథరాజనందన చరిత్ర పీఠిక, 36-39 పుటలు- మరియు. 71-79 పుటలు)

ఈ పద్ధతిగా 'వ'ను గ్రహించి కవిగారు - సీతారాఘవ చరిత రచనలో కొంత సులువైన పద్ధతి నవలంబించి రన వచ్చు. పూర్వము పేర్కొనబడిన - చిన్నచిన్న పద్యాలున్నందున - రచన సులభ గ్రాహ్యము గాఁ గలదు.

ఉదాహరణకు - కొన్ని పద్యాల భాగములు -

'చెట్లు కదలకుండ చీకట్లు నెలకొనె-' 226

'అగణితలీల నాగిరి గుహాంతర ధారుణి
నెంతో వేడ్కతో.' 842

'కరుణాకర రఘుచంద్రా' 361

'వెడలి నావ నెక్కి యొడద కల్లడ
నొందె-' 921

'అందుస్నారతి గర్వనిగ్రహులుద గ్రాం
తస్కులున్.' 1089

ఈవిధమైనవి కనుపడును.

నిరోష్ఠ్యనియమము కావున 'ము' నిషేధముగదా! అప్పుడు. అస్త్రసంధించి- 295. ఆశీర్వచనలంది - 393 - మొదలైన రూపాలు ప్రయోగింపబడినవి. ఈ పద్ధతి నిరోష్ఠ్యరచనలకు తప్పనిది. కాని - సీతారాఘవ చరిత్రకర్త-హానును 'నుహానున' (342) చేసినారు - దీనికాధార మెక్కడిదో? నియమములో - 'హానుమ' అర్థరహితుడైనాడు. అవిధముగనే - సంయమీశ్వరుడు - సంయతీశ్వరుడయినాడు (961) ఇచ్చట గూడ అర్థము - కుదరదే?

మరికొన్ని చోట్ల ఛందోభంగ (రూపాలు) పొడచూపున్నవి.

1) 'ఓయి! అంగద సుగ్రీవ వొచ్చినట్టి- (503) 'వచ్చినట్టి' కావలయును. 'వొ' ఉండదుగదా?'

2) 'యాయచంచలుఁడు కరితాలరథ' (646)

3) ఆటలను గత్తునాజ్ఞ గొన్న
రఘువీరు' (336)

4) యయాతినువేరు దైవగతి యవ్వరు (927) - ఇందు. 'య' తో చరణము ప్రారంభమై - 'యు' తోయతి, 'ఎవ్వరు

అనుటకు ఈగతి. 'యకారతంబునువు. వూ-వో-వోలును తెనుఁగు మాటలకు మొదటలేవు' - అను సూత్రము జ్ఞప్తిలో నున్న ఈపద్య మిట్లుండక పోవునేమో!

మరికొన్ని పద్యములయందు గణభంగములు గలవు. ముద్రణలో గానవచ్చు కొన్ని యక్షరములు ముందు వెనుకలై పాఠకుని బాధపెట్టును. ఎంత సవరించుక చదువుద మన్నను కవిగారి పాఠ మరగత మగునట్లు లేదు (ఆపద్యాల సంఖ్యలు - 182, 198, 380, 594. 753, 802, 831, 984, 990, 1017). 64 పద్యమునందు 'కుబ్జిత' అనిగలదు. ఈపదమును మనము - 'మంథర' అను నర్థముగా భావించినచో 64, 65 సంఖ్య గల పద్యము అర్థమగును.

353 పద్యమున - 4,5 చరణముల యందు కర్తయెవరో? తెలియదు. సంస్కృతమున ధనుశ్శబ్దము గలదుగదా! తత్సమమున 'ధనుస్సు' అందుము. కవిగారు మాత్రము - మాటకు వీలుకలుగ నట్లు 'ధనువు' అని వాడినారు. (ధనసు, మనుష్వు - ఎంతబాధకలిగించునో విజ్ఞు లూహింతురుగాక)

ధ, నస్సె త్తికోలల నట్లవైచి - 690

ధ, నస్సునెత్తుచు నుందు వగ్నివాయు ( 699

ఇంకను - ధనుసు (52) పదను (826.848) శ్రేయను (542) అని - ప్రయోగించినారు.

వీనికితోడు - క్రోధాగ్రుఁడైనాడు - (735) ఈవిధమైన క్రోధాగ్రుడు, 644 645, 677, 733, 741, 743 - సంఖ్యగల పద్యములయందు గనపడును.

'విషాదచ్ఛాయ - విద్యుజ్జిహ్వుడు - శ్వేతచ్ఛత్రము' - అనునవి - కవిగారి ధాటిలో విషాదఛాయ (91)విద్యుజిహ్వ (550) శ్వేతఛత్ర - (728-820) ములైనవి. వీనికి తోడు ధనుస్సాదిచేత పట్టి'- అనియును గలదు.

ఈవిధమైన - పదములు - ప్రయోగములేగావు. పాఠకుల పరిశీలనకు మరికొన్ని పదముల నిచ్చుచున్నాను, (వాడి మయూఖములు' - వేడిపయోధరలు - దీపకంబాలే మనకు పూర్వకవులిచ్చినవి- వీనిని మించి - ఈకవిగారు మరింత ముందుకు పోయినారు)

దుష్టకలలు - 112, వక్రకీడు - 125, చిత్రకూటయడవి - 134 కాకా దివంటలు - 137, రక్తచుక్కలు - 162 వీరకాజా - సింహాశేల్లు - 168, వృక్షు సందులు - రక్తచారలు, వజ్రరవ్వలు - 246, యుద్ధనేల - 279, క్రౌంచాది కొక్కెర 442, ఘోరకీడు 468, సాష్టాంగ కేలొనర్చి - 490, సాష్టాంగ కేలిడ్చి, 500, రక్తకోల-551, కాలకోలాస్త్ర - 479, గృహాంతస్థు 589, నాగతాడు - 604, వృక్షుతుండ్లు 605, తృతీయరేయి- 608, శరకీడు 625, రథడిగ్గి (ము-వద్దుగదా) 644, లతాంత రేకులు. 682, 745, లోహగడ్డాస్త్ర - 893 వాయువాస్త్ర - 694, ఇషునిడ్వ - 703, రథజెండ - 735, ఛత్రజండల - 735, చందనకట్టెలు 758, కనకాదినగలు - 826, సాగర్జలకడవల్ 836, ఇవియేగాక 840, 855, 870, 900, 903, 957, 966, 1929, 1062, 1062, 1079, 1124, సంఖ్యగల పద్యములలోను - పైపద్ధతి పదములు గలవు. పునరుక్తములైన యర్థములు గల పదాలు -

దండకారణ్యాది యడవి - 165, (అరణ్యము - అడవి వేర్వేరా?) శృంగారగచ్చు సౌధవనాదులు-803 (వనమెట్లున్నను. గచ్చు - సౌధము - ఏమి? సుధ - సున్నముగదా?)

యాగక్రతువు - 960, హవక్రతు - 965 యజ్ఞహయక్రతువు. 974. ఈపదాలకు - కవిగారు ఇంకేమైన విశిష్టార్థములు చెప్పగలరేమో?-

ఈ విధమైన పదములు మరిన్నిగలవు. విస్తరభీతిచే పేర్కొనలేదు. ఇట్టి పదముల నెట్లు సమర్థింపవచ్చునో? ఊహాకందుటలేదు. శ్రీ దివాకర్లవారు తొలిపలుకులో -' భక్తియే వారి నింతపనిచేయించినది. వారువ్యాకరణాదులేమియు చదువుకున్నవారుకారు' అని ఒకనిజమును పాఠకునికి దెల్పినారు. భక్తి విషయమును దేవుడెరుగును. కాని, వ్యాకరణ విషయము మాత్రము - నిజమనిపించుచున్నది.

వ్యాకరణ చ్ఛందోలంకారముల యందు కూలంకషమగు పాండిత్యమును సాధింపకున్నను, కనీసము - సాధ్వసాధువులైనను గ్రహించు నంతమేర తెలిసికొనుట యావశ్యకము.

పద్యరచనకు - సాంప్రదాయిక కవితకు - ఇట్టిపద్ధతి అనుల్లంఘనీయము గదా? అందులో నిర్దోష్యము, ఒక్క నియమము కొరకు - అన్ని నియమాల నుల్లంఘించుట ధర్మమా? అను నట్టిది తీరని యనుమానము.

ఈ విధమైన దోషములను సహించిన పాఠకునకీగ్రంథము సులభముగా అర్థమగును.

మొత్తమువిూద - తెనుగువారికి మరియొక నిర్దోష్యరామాయణ మందించినందుకు కవిగారికి కృతజ్ఞతలు తెల్పుట సాహితీ సహృదయుల కర్తవ్య మనుకొందును.

—...—

## ఆశ్రుతర్పణము

శ్రీ మామిండ్ల రామగౌడు.

భారత జనతాంతరంగ
భాగ్యధాత జయప్రకాశు
మహితాత్ముడు ఋషితుల్యుడు
మానవతావాది హితుడు

నరుడై జనన మొందిన
నారాయణు నవతారము
స్వార్థరహిత సహనశీలి
సాధుమూర్తి ధైర్యశాలి

ప్రభావతీ ప్రభావమున
బ్రహ్మచర్య దీక్షబూని
యతీంద్రుండు జితేంద్రియుడు
యశోధనుడు దిగ్విజయుడు

అతుల దేశభక్తియుతుడు
అపరగాంధి మహాత్ముండు
నిష్కపటపు చక్రవర్తి
నీతిజ్ఞుడు నిర్మలుండు.

పదవుల విడనాడిప్రజల
యెదలందున నిలిచె సతము
త్యాగానికి ప్రతిరూపము
యోగానికి మణిదీపము

మృత్యువుతో పోరాటము
సత్యానికి నారాటము
నిర్విరామ కృషినిసల్పి
నిర్యాణము నొందెనతడు.

రాజకీయ పంకిలమున
రాణించుట దుర్లభమని
జనకునివలె మనజాతికి
జాగృతి కలిగించినాడు

భాగ్యమ్మును వదలియుండై
రాగ్యమ్మున మెదలిన మన
మార్గదర్శక ప్రవరుడు
మానవ నవహారుడు గురుడు

అరిషడ్వర్గముల ద్రుంచి
ఆశాపాశముల ద్రెంచి
అధికార మదోన్మత్తత
నణచిన బ్రహ్మర్షి సముడు

ఇంద్రపద మొసగిన నొక
తృణముగ భావించి మించె
మాయను దునుమాడి లోక
నాయకుడై రహించె

సత్యము జ్ఞానము ధర్మము
సహకారము కృపారసము
శాంత్యహింసా సహనమ్ములు
సహృదయునకు సంపదలివి

జయప్రకాశ నారాయణ!
జగద్వినుత గుణభూషణ!
అమరవీర! జోహారులు
నశ్రు తర్పణాంజలు లివె.

—...—

## కులపాలికా ప్రణయకవితా రసధుని - శ్రీనాయని

— శ్రీ ధూర్జటి వేంకట బాలాజీ.

'వల పెణుంగక బ్రతికి
కలికి మురిసేకన్న
వలచి విఫలమ్మొంది
విలపింప మేలురా!

అని ఆధునిక కవిత్వానికి ఆప్తబంధువు 'బసవరాజు' అన్నమాటలను బట్టి చూస్తే, కలపులో సంయోగం కంటె వియోగమే మధుర మనిపిస్తుంది. ఈవలపునకు 'ప్రేమ' అనే విశాలార్థం కల్పిస్తే ఈప్రణయకవిత్వాన్ని వ్యక్తం చేయడానికి ఆధునిక కవిత్వం ఏభైయేళ్ళ క్రిందట తెలుగుసాహిత్యంలో పుట్టి నవ్యకవుల హృదయాలలో పీఠం వేసుకొంది.

పురాణమార్గాన్ని వీడి ప్రబంధమార్గాన్ని అనుసరించినవారు కృష్ణరాయల యుగం నాటి కవులైతే, పాశ్చాత్య సాహిత్యప్రభావానికి లోనై, భావనలో, భాషలో వైలక్షణ్యం చూపి ప్రకృతి, ప్రణయం, ప్రబోధం, జాతీయత యితివృత్తాలుగా స్వీకరించి కవిత్వాన్ని వ్రాసినవారు ఆధునికులైన ఇరవయ్యో శతాబ్దికవులు. వీరి కవిత్వానికి ఆయువుపట్టు ప్రేమ. ఈ ప్రేమ-తత్త్వాన్ని వారు కవిత్వంలో వ్యక్తంచేసి తమకవిత్వానికి 'ప్రణయ-కవిత్వము' అని పేరు పెట్టుకొన్నారు. ఈ 'ప్రేమ' అంటే ప్రాచీనుల దృష్టిలో మిథునక్రీడ. అంటే శారీరక సౌందర్యమన్నమాట. కాళిదాసు వంటి పరమ ప్రామాణికులైన కవికులగురువులు కూడా తమ కావ్యాలలో శారీరక సౌందర్యానికి ప్రాముఖ్య మిచ్చారు.

కానీ-ఆధునికులు శారీరక సౌందర్యానికి కాక హృదయ సౌందర్యానికి ప్రాముఖ్య మిచ్చారు. పాశ్చాత్య సంపర్కంవలన పాశ్చాత్య సంస్కృతి సంప్రదాయాలను సాహిత్యం ద్వారా గాఢ అధ్యయనంచేసిన నండూరి, రాయప్రోలు, దేవులపల్లి, అబ్బూరివంటి ఆధునిక కవులు తమ కావ్యాలలో ఊహాప్రేయసులనుసృష్టించుకొని, కవిత్వాన్ని వ్రాయడంవలన వారి కవిత్వంలో కేవలం హృదయభారాన్నివ్యక్తంచేసె నిజాయితీ ప్రేమ బయటబడింది. దీనికే వారు పెట్టినపేరు 'అమలినశృంగారం' కొందరు సంస్కృతకవులు తమ రచనలలో

'త్వమసి మమ జీవితం
త్వమసి మమ జలధిరత్నం-' అనీ
'త్వం జీవితం త్వమసి మే హృదయం'
... ద్వితీయం'

అని అన్నమాటలను బట్టి చూస్తే హృదయ సౌందర్యం ఎంత గొప్పదో అర్థమౌతుంది. దాన్నే నవ్యులు 'అమలిన శృగారం' అన్నారు. ప్రాచీన కవుల దృష్టిలో ప్రేమకు-శారీరకభోగం పతాకస్థాయిఅయితే- నవ్యులప్రేమకు ఆత్మసౌందర్యం, ఆరాధనలు ఆలంబన వస్తువు

లైనాయి. ఇందుకు దేశకాల పరిస్థితులు తోడయ్యాయి. పరసాహిత్య ప్రభావాలు పాదులు తివ్వాయి.

ప్రాచీన సాహిత్యంలో కవిత్వానికి కవిత్రియం ఔన్నత్యాన్ని అందిస్తే, ఆధునిక కవిత్వంలో 'సుబ్బారాయ త్రయం' అమలిన శృంగారాన్ని తమ భావనలో రంగరించి పతాకస్థాయికి తీసుకొచ్చారు. వీరి ముగ్గురివి మూడు విలక్షణమైన కవితారీతులు. ఆంధ్ర కవితా పితామహుడు 'అల్లసాని పెద్దన' గారైతే 'ఆధునిక కవితా పితామహుడు' రాయప్రోలు సుబ్బారావుగారు. వీరి కవిత్వంలో ఒకరకమైన సంప్రదాయ కవితాగంధం వెల్లివిరుస్తుంది. వీరి వృత్తం ప్రాచీనమైనా, భావన ఆధునికం, భావ సంప్రదాయ బంధురం. 'మామిడికొమ్మ మీద కల మంత్ర పరాయణుడైన కోకిల స్వామి' అని పలికినవీరు, అమలిన శృంగారానికి పరాకాష్ఠగా 'తృణకంకణము, స్వప్నకుమారము'వంటి ఆధునిక స్వతంత్ర భావకావ్యాలను వెలయించారు. వీరి కవిత్వంలో ప్రాచీన సుగంధంతోకూడిన మాటల పోహళింపు వ్యక్తమౌతుంది.

ప్రేమ నాగరకులలోనే కాదు-జానపదులలోకూడ ఉందనేవిషయాన్ని తమ 'ఎంకిపాటలు' అనే వినూత్నమైనకావ్యం ద్వారా వ్యక్తంచేసిన వారు శ్రీ నండూరి సుబ్బారావుగారు. 'మల్లెపూలతో నిర్మింపబడిన తేరుమీద తేలిపోయినట్లుంటుంది జానపదుల శృంగారం' అని ఎవరో ఒక విమర్శకుడు అన్నట్లుగా జానపదుల శృంగారం మిగిలినవానికంటే విలక్షణంగా ఉంటుంది. నండూరి వారి కావ్యనాయికా నాయకులైన 'ఎంకి-నాయుడుబావ'లు ఈ లోకంతో సంబంధంలేని ప్రేమైకమూర్తులు. వారిప్రేమ అనిర్వచనీయం-ఆపాతమధురం. హృదయసౌందర్యానికి ప్రాముఖ్య మివ్వబడిన యీ కావ్యంలో, నండూరి వారు తానే నాయుడుబావై' ఎంకి అనే ప్రేయసిని సృష్టించుకొని కావ్యం రాసారన్నది తిరుగులేని సత్యం.

వీరిరువురి కంటే భిన్నులు నాయని వారు. ఆయన కవిత్వాన్ని తెచ్చి జీవితంలో పలికించలేదు. జీవితాన్నే కవిత్వంగా మలుచుకొన్నారు. తనలో భాసించిన ఏభావాన్నీ వ్యర్థంచేయలేదు. దానికి అనుభూతి పోసి ప్రతికించారు. శిల్పంలో చెక్కలేదు. శిల్పంవస్తే కాదనలేదు.

నాయనివారు స్వచ్ఛమైన నిజాయితీ గలిగిన ప్రేమికులు. అందుచేతనే ఆయన చేతినుండి 'సౌభద్రుని ప్రణయయాత్ర' వంటి కావ్యం వచ్చింది. సౌభద్రుడంటే సుభద్ర కుమారుడైన అభిమన్యుడు. అతడు తన మేనమామ బలరాముని కుమార్తె వత్సలను ప్రేమించాడు. వత్సల కూడా తనను ప్రేమించింది. కానీ-యుక్తవయస్సు వచ్చేటప్పటికి బలరాముడు వారివివాహాన్ని తిరస్కరించాడు. ఎట్టకేలకు పలుసమస్యలకు లోనై వారి వివాహం జరుగుతుంది.

సుబ్బారావుగారీ యితివృత్తం తీసుకోడంలో తగిన కారణం లేకపోలేదు. తాముకూడా తమ మేనమామకుమార్తెను ప్రేమించారు. గొప్ప హోదాలో ఉన్న తాధికారిగా ఉన్నవారి మేనమామ అందులకు గట్టిగా ప్రతిఘటించారు. తత్ఫలితంగా వారిపెండ్లి ఆగిపోయింది. చివరకు జరిగింది. అందుకే కాబోలు తమ జీవితంలో కలిగిన సంఘటన యితివృత్తంగా తీసుకొని దానిని సౌభద్రుని జీవితంతో సమన్వయించుటచేత - వారి సౌభద్రుని ప్రణయయాత్ర - కులపాలికా ప్రణయకవితాతత్త్వానికి నాంది పలికింది. కులపాలిక అంటె ధర్మపరంగా వచ్చిన యిల్లాలు. తలిదండ్రులచాటున పెరిగిన బిడ్డ.

సౌభద్రుని ప్రణయయాత్ర ఇరవయ్యో శతాబ్ది భావకవిత్వంలో వచ్చిన ఒక ఆణిముత్యం. ఇతివృత్తం ప్రసిద్ధమైనదే కావడంచేత, వ్యక్తీకరించిన మార్గంకూడా భిన్నంగా ఉండడంచేత - అందులోనూ నాయనివారి చూపు మిగిలిన వారికంటే విలక్షణంగా ఉండడంచేత సౌభద్రుని ప్రణయయాత్ర'తో వారికి సాహిత్య లోకంలో శాశ్వతమైన స్థానం లభించింది. తెలుగుతనాన్ని సంతరించుకొన్న పటిష్ఠ సంస్కృతి భూయిష్ఠమైన రచనకు నాయని వారి కవిత్వం ప్రతీక. ఇది వారి కవిత్వానికి జీవలక్షణం కావచ్చునేమో! కానీ-వారి ఆకవిత్వంలో నిబిడీకృతమైనది కులపాలికాతత్త్వం - కులపాలికా ప్రణయతత్త్వమే యీక్రింది విధంగా వ్యక్తమౌతుంది.

'ప్రణయ మనోజ్ఞస్వహృదయ సంభవము
గాగ

సిగ్గుచీర ముసుంగేల చిన్నదాన!
సగమువాలిన ఱెప్పల తగులుబాపి
చిన్నచూపులుమాయంగు చేర్పరాదె!'

సిగ్గు ఆడవాళ్ళకు సహజంగా వచ్చిన ఒక దివ్యాభరణం. అందులో ముగ్ధలైన వాళ్ళకు మరీను! సౌభద్రుడు వచ్చిన విషయాన్ని ఎఱిగిన వత్సల తనమనస్సులో అతన్ని చూడాలనే బలమైన కోరికను అణచుకోలేక సగము వాలినరెప్పలతో అరమోడ్పు కన్నులతో సౌభద్రుని వీక్షించుచున్నదన్న విషయం నాయని వారు ఇలా చిత్రీకరించారు.

ప్రేమించే హృదయం అందరికీ ఉండదు. నిజాయితీతో వ్యక్తపరచే ప్రేమ ఎప్పుడోగాని మనకు సాక్షాత్కరించదు. ఆ ప్రేమ సాక్షాత్కారాన్నే నాయనివారు 'సాక్షాత్కారము' అనే ఖండికలో ఇలా అన్నారు.

'దట్టపున్నీల నీరదాంతరమునందు
దాగుకొనియున్న చంద్రమండలపురేఖ
చిటికెలో పైకిలేచివచ్చినవిధాన
ప్రణయ మావిర్భవించె నాస్వాంతవీథి'

అందమైన వినీలాకాశంలో మబ్బుల చాటున చందమామ మబ్బులు విడిపోగానే తటాలున ఒక్కసారి ప్రత్యక్షమైనట్లు ప్రణయం కూడా హృదయాకాశంలో వెల్లి విరిసిందట!

ఆత్మౌన్నత్యం, ఆత్మార్పణం, ప్రేమ తత్త్వానికి పరాకాష్ఠలు. భావుకుడైన కవి సహజంగా ప్రేమించగలిగిన మనసు కలవాడైతే అతని భావన, మాటల లాలిత్యం, కవితాధార విలక్షణంగా ఉంటాయి. ఇక్కడ నాయనివారు తామే ప్రేమికులై తమ కవితాతత్త్వాన్ని ప్రేమతత్త్వంతో సమన్వయించారు. తమ ప్రేయసిని గూర్చి జాహ్నవీ స్వచ్ఛ సుధాస్వాదుమూర్తి' అని పలకడంలోనే వారి కవిత్వ తత్త్వమేమిటో పఠితలకు అవగతమౌతుంది.

కావ్యలక్షణాలలో ధ్వని ప్రధానమైంది. కవి కవిగా రాణించడానికి, వ్యుత్పత్తి, ప్రతిభ, అభ్యాసాలెంతగా అవసరమో, కావ్యాన్ని పతాకస్థాయికి తీసుకొని పోవడానికి కావ్యంలో అంతర్భాగంగా నిబిడీకృతమగు ధ్వనికూడా అంతే అవసరం. ఆ లక్షణాన్ని తమ కావ్యంలో వ్యక్తీకరింపజేశారు మన నాయనివారు. నిజానికి తాను చిత్రించింది పలపాలికా ప్రణయతత్త్వమైనా, యీ కావ్యంలో తన్నే సాధ్రునిగా ఊహించుకొని కావ్యాన్ని వ్రాయకపోతే, తనజీవితంలో ప్రేమతత్త్వాన్ని కావ్యంలో వ్యక్తీకరించకపోతే యింత పటిష్ఠమైన కావ్యం, నాయని వారి కలం నుండి ప్రవహించేదికాదు. అందుకు దృష్టాంతంగా కావ్యాంతాన-

'భావ యనుమాట ప్రేమప్రపంచమునకు
నీవు పెట్టినపేరు నాభావమందు
పద్యములలోంచి అక్షరప్రాభవమున
బయలు వెడలుటలో శ్రమపడుదునేను'

అన్నమాటలను బట్టిచూస్తే కవిత్వాన్ని ప్రేమికుడైన కవి జీవితంలో పలికించగలడనే భావం మనకు స్పష్టపడుతుంది. సుబ్బారావుగారు ప్రేమతత్త్వాన్ని హృదయ-వీణలో ఎంతబాగా పలికించగలరో, కరుణాన్నికూడా అంతబాగా వ్యక్తంచేయగలరు.

జీవితంలో జన్మను ప్రసాదించిన తల్లి కంటె పూజ్యులు ఇంకొకరు లేరు. అటువంటి మాతృమూర్తి తన జీవితయాత్ర నుండి నిష్క్రమించినపుడు ఆమె బిడ్డగా తాను ఎంత చిత్తక్లేశాన్ని, మనస్తాపాన్ని పొందవచ్చునో ఆయన తన 'మాతృగీతాలు' ద్వారా అభివర్ణించారు. ఒక ఎగలోవచ్చిన యీ మాతృగీతాలను చదివి సుబ్బారావుగారు తమ మాతృమూర్తిపట్ల వ్యక్తంచేసిన ప్రేమాభిమానాలను శ్లాఘించని సాహిత్యవేత్త లుండరు.

ఈ క్రింది పద్యంద్వారా వారి కవితాతత్త్వమెట్టిదో స్పష్టపడుతుంది.

ఎవ్వడా క్రూరకర్ముడు డెవడు, నీల
జలదనిర్ముక్త శైశిర శర్వరీ ప్ర
శాంతిమలవాటుపడిన నిశాంతిమందు
అకట, నట్టింట దీపమ్ము నార్పినాడు.'

ఇల్లాలైన స్త్రీ యింటికి దీపంవంటిది. మాతృమూర్తియైన యిల్లాలు తన సంతాన సంరక్షణభారాన్ని గురించి వివేచిస్తుంది! అందుకే! కాబోలు! పెద్దవాళ్ళు 'ఏనుగంత తండ్రికన్నా-ఎముకల బుట్టవంటి తల్లి మేలు' అని పలుకుతుంటారు. మరి ఆ తల్లే లేనపుడు ఆయింటిదీపం ఆరిపోయినట్లే కదా!

ఇంతలో నాయనివారి ఆవేదన మాతృమూర్తిపట్ల ఆయనకు గల అభిమానం ఎలాంటిదో వ్యక్తమౌతుంది! 'ఎవడా క్రూరకర్ముడు' అంటే దైవాన్ని ప్రశ్నించడమన్నమాట. అతడు నిర్దయుడు-విరసాత్ముడు, నిర్దయాస్వాంతుడని తరువాత రచనలలో వ్యక్తంచేస్తాడు కవి.

మరొకచోట తల్లీబిడ్డల మధ్యగల ప్రేమానుబంధాన్ని వ్యక్తం చేస్తాడు! చిన్నపిల్లలు ఒక వయుస్సు వచ్చేంతవరకు తల్లికొంగు పట్టుకొని తిరుగుతుంటారు. తల్లులు ఎక్కడికిపోయినా, వారివెంట పిల్లలు వెళ్ళడం ఒక ఆనవాయితీ!

'నీవు మడిగట్టుకొనిపోయినావు పండ్లు
పుష్పములు పట్టుకొని దేవపూజ కొఱకు;
నేను నీకొంగుపట్టుక నీదువెంట)
బోవుటకు లేక కన్నీటిబొట్లు రాల్తు!'

ఇక్కడ దేవపూజకు పండ్లు పుష్పాలను పట్టుకొని వెళ్ళావనడంలో నిజానికి తల్లి వెళ్ళినది దేవాలయానికి కాదు. జీవులందరు శరీరాలను త్యజించిన తరువాత వెళ్ళేచోటుకు. నిత్యం కొంగుపట్టుకొని తల్లివెంట వెళ్ళే తనయుడు ఈనాడు వెళ్ళలేడు! కారణం తల్లివెంట వెళ్ళిన చోటుకు తన వెళ్ళలేడు కాబట్టి! ఇక 'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ' అనేసూక్తి నాయని వారిపట్ల సార్థకమౌతుంది.

ఇతివృత్తంగా స్వీకరించి 'జన్మభూమి' అనే కావ్యాన్ని చక్కగా వెలయించారు. కవిభాషలో, భావనలో-శిల్పంలో; వృత్త-వైవిధ్యంలో ఎంతైనా చిక్కదనాన్ని సంపాదించారు. నిజానికి ఒక చక్కని ప్రబంధం వ్రాయగలిగిన వారనేభావం ప్రతి పాఠకునకు సాహిత్యవేత్తకు ఈకావ్యం చదివిన తరువాత కలుగుతుంది.

ప్రస్తుత కావ్యంలోని రచనా వైవిధ్యాన్ని, వృత్తవైలక్షణ్యాన్ని, చిక్కదనాన్ని గమనిస్తే ఈ కవిత్వంమీద విశ్వనాథవారి ముద్ర వ్యక్తావ్యక్తంగా కనబడుతుంది. అందుకు 'విశ్వనాథ వారికి అసలుతోడబుట్టినవారు శ్రీ వేంకటేశ్వర్లు' అయితే, సాహిత్యంలో తోడబుట్టినవారనిపించుకొన్నారు శ్రీ నాయని సుబ్బారావుగారు. నిశితంగా పరిశీలిస్తే కొన్ని

( తరువాయి 39 వ పేజీలో )

# గ్రంథ సమాలోచన

## కాశీవిశ్వేశ్వర స్తవము.

[రచయిత: సాహిత్యకోవిద శ్రీ క్రొవ్విడిరామం, బి.ఏ.,బి.యల్. బియిడి. మఠం వీధి. కస్బా. విజయనగరం 2. వెల రూపాయిన్నర.]

శతకమార్గము ననుసరించి భిన్నమకుటములతో నివేదనము, దర్శనప్రభ, సాహిత్యాంజలి, కాశీగాథాలహరి, భరతవాక్యము ననునైదుశీర్షికలతో సాగిన దీగ్రంథము. పదబంధమున, పద్యవిన్యాసమున, భావనలోను, మరింత పరిణామ మవసర మనిపించును. సంశోధనకొందించగా వంటి చిత్రపదవిన్యాసము, శార్దూలపదమును పలుమార్లావృత్తి చేసిన పద్యనిర్వాహణము, మరియు దానిలోని భావము, చిత్రవిచిత్రములై యున్నవి. (2వ పద్యము 'శార్దూలంబయి' ఇత్యాది పద్యము). లోక-లోకోత్తర, సాకల్యంబుగ-సామీ, ఆకర్ణింపుము-హర్షార్ణవా వంటియతివిన్యాసములు పద్యగంభీరతను తగ్గించిన వనవచ్చును.

14వ పద్యములోని సాంగోసాంగము గాగ నాట్యమును సచ్ఛాత్రాళికిన్ నేర్పగా ఇత్యాది పద్యభావము విచిత్రము. పరమేశ్వరునిది తాండవము. నాట్యముకాదుగదా! దానిని సచ్ఛాత్రాళికి నేర్పు టేమి? తవారాధనల్ తనశిఖన్, వంటిసమాసములు, ఐక్యత అధిక్యత, ధీశాలురు, రక్షోమాం వంటి పదబంధములు నిందు గలవు. భరతవాక్యము నాటకాదిరూపకములలో కలదనివింటిమి గాని శ్రవ్యకావ్యములనున్నదా! అదియు ననేకత్వమునందుట మరింత చిత్రముగా గానున్నది.

కాని ప్రతి పద్యమునను కవికిగల పదసంపత్తి, భావనాస్ఫూర్తి, యగపడును. వానికి మరింత స్పష్టమైన పరిణతమైన, రూపుకట్టిన సర్వాంగశస్త మనదగును. శిల్పకళను బట్టి కవియాలోచనాపటిమ స్పష్టమగును. పద్యము-దాని నిర్వాహణలో వలసినంత సంపత్తియున్నను నది వినియుక్తము కాలే దనిపించును. వీరు మరింతగా కృషిచేసిన మరింత మనోహరమైన కవిత్వమును రచింపగల రనిపించును. సుమారు నూరు పద్యములతో 40 పేజీలుగల యీ గ్రంథము వెల మిక్కిలి యెక్కువనిపించును. రచనా విభాగము మున్నగునవి బాగున్నవి.

## రామప్రభు శతకము.

[రచయిత శ్రీ ఇమ్మడిశెట్టి చంద్రయ్య గారు. ప్రతులకు శ్రీ మద్దనూరు పాండయ్యగారు. పోలీసుపటేలు, బుద్ధసముద్రము. నాగర్‌కర్నూలు. మహబూబ్‌నగర్ జిల్లా. వెల తెలియదు.]

నిసర్గమధురమగు రామకథ ననేకు లనేకరీతుల పలికిరి. శతకలక్షణమగు మకుటములో కథాత్మకముగ రచించుట నూతన ప్రక్రియ యనవచ్చును. ఇట్టి నూతన ప్రక్రియను నిర్వహించుటకు వలయు సాహసముతోపాటు పదసంపత్తి, కథానిర్వహణము మున్నగు చాతుర్యములు కావలయును. ఆలక్షణములు దాదాపుగ గల కవులు శ్రీ ఇమ్మడిశెట్టి చంద్రయ్యగారు. వీరు రామప్రభూ యను మకుటములో రామకథను కుశలవులచే రామునకుఁ జెప్పించిరి.

కుశలవుల కథనముతో నారంభమైన కథ ముగింపు కుశలవుల ప్రస్తుతితోనో మరొకదానితోనో జరిగిన బాగుండెడిది. ముద్రారాక్షసములు పుష్కలముగా కలవు. ఎట్టి తపంబాతఁడొనర్చెనో దాడరి సూటిన్ మీఱ రామప్రభూ (5ప.) క్రికీతలంగల నిరర్థక పదములు విడిచిన బాగుండెడిది. 'సేవించి రే పేర్మి'(15ప) క్రిక్రీతయు నట్టిదేకదా' ఇట్టివింక నుగలవు. తేనోవంతుకు (22ప) వంటివి విచారణీయములు. 27వ పద్యములో 'ఆహా! వారి కెట్టిదో' 28లో దీటగు నీపాదుకలిచ్చి పంచితివి' 41లో ముక్కు చెవులుం గోయించితే గాద సూర్యజనాభిలుని నీ సహోదరునిచేతన్' శూర్పణఖ ముక్కు చెవులను లక్ష్మణుడే కోసెనుగాని రాముని సూచనపైఁగాదుకదా! 43లో 'హోమసామగ్రి సత్తను సీత, (సత్తమయున్నచో బాగుండును. బహుశః ముద్రారాక్షసము కావచ్చును.) 83లో చెంచువెలందట్టి (ఇచటి సంధి విచారణీయము) 109లో 'శక్త్య దీరగ' తెనుగులోని కని, కచ్చ, సంస్కృతములో కక్ష్య, కావు. 23, 24 పేజీలు తిరుగబడినవి.

మొత్తముమీద నిర్వాహణ మున్నగునవి ప్రశంసనీయముగ నడచిన వనవచ్చును. వీరు మరింత కృషితో మరింత ప్రశంసార్హమగు కావ్యసంపత్తిని వెలయింపగల రని యాశింపవచ్చును. పద్యరచన, తదభిమానము రెండు నడుగంటిన యీకాలములో నిట్టి సృజనాత్మక కావ్యములు వచ్చుట మెచ్చదగినది. వీరికి గల భావనాశక్తి, పదసంపత్తి, రచనాకౌశలము మరింత కృషితో బాగుగా రాణింపఁగలవు.

## శ్రీ మృత్యుంజయ శతకము.

[రచయిత శ్రీ ఇమ్మడిశెట్టి చంద్రయ్య గారు. ప్రతులకు శ్రీ కల్లిపురామలింగయ్య గారు. సాయనిపల్లి పోస్టు. నాగర్ కర్నూలు. మహబూబ్ నగర్ జిల్లా. వెల తెలియదు.]

శతక వాఙ్మయము తెలుగునాట బహు విధముల వికసించినది. అట్లు వచ్చిన శతకములలో శ్రీ మృత్యుంజయశతక మొకటి. ఇందలి పద్యములు చక్కని ధారాశుద్ధితో చక్కని భావనతో మనోహరములై యున్నవి.

21లో భక్తిప్రాణసంత్రాణ దోషలి నాకా! ముద్రారాక్షసములు పుష్కలముగా నుండుటచే నిట్టిచోట్లననుమానము వచ్చును. 22లో 27లో నిట్టివి మరింత బాగుగ నగపడును. 30లో సుభాగ్యము 51లో 'నిన్ గొలువంబూనితి గాన నానతులు గైకోవయ్యా' 'కా:' యెందులకు? ఇట్టి వచటవచట నున్నను, 53, 55, 56, వంటి పద్యము లనేకములు పాఠకుల నాకర్షింపు ననుటలో సందేహము లేదు. ఇందలి పద్యములు కవికి తాత్త్వికముగ, యౌగికముగ, బహువిషయములనున్న పరిచయానుభవములను, భక్తిని, గాఢభావనను కల్లడించును. పద్యరచన, పదవిన్యాసము మున్నగునవి ప్రశంసనీయములు.

ఇట్టి పద పద్య భావరచనా సంపత్తికల వీరు మరింతగా యత్నించి మనోహర కావ్యములు రచింపగల రనుటలో సందేహము లేదు.

—...—

( 37 వ పేజీ తరువాయి )

చోట్ల అమ్మ విశ్వనాథ వారిలాగే కప్పిత్వాన్ని పలికించారు. ఎట్టి వికారము లేకుండా!

ముఖ్యంగా 'పాడలి' యందలి రాళ్ళను కవిత్వీకరిస్తుంటే కొండవీటి పొగమబ్బులు జ్ఞప్తికి వస్తాయి పద్యాన్ని కొరడా విసిరినట్లు, దారపుబంతిని విసిరి కొసపట్టి లాగినట్లు కొందరు రచన చేయగలరు. అదే పద్య విద్య అయితే ఆవిద్య నాయని వారికి బాగా వచ్చును.

ఇక యితివృత్తంగురించి ముచ్చటించుకొంటే, సహజంగా ప్రసిద్ధేతివృత్తమే దైనా కవిని పైకితీసుకొని వెళ్తుంది. అప్రసిద్ధ వస్తువైతే కవి పైకి లేవనెత్తాలి. సరిగ్గా మన సుబ్బారావుగారి విషయంలో అదే జరిగింది.

అయితే వారు అప్పటికే 'సౌభద్రుని ప్రణయయాత్ర' ద్వారా ప్రణయకవుల కోవలో చేరి, 'మాతృగీతాల' ద్వారా రసజ్ఞుల హృదయాలను ఆకర్షించి 'జన్మభూమి' కావ్యం ద్వారా సాహిత్య లోకంలో స్థిరపడ్డారు.

ప్రస్తుత కావ్యంనిండా ఒక విధమైన ప్రాచీన కావ్యపరిమళం వ్యాపించి ఉంది. అందులో ఆయన వృత్తవైవిధ్యం-రచనా శిల్పం-కొందరిని ఉక్కిరిబిక్కిరి చేసింది-జాగ్రత్తగా గమనిస్తే నాయని వారు సృష్టించిన ఆ కావ్యం ఆధునిక కవితకు ఒక సవాలు. వసుచరిత్ర పద్యాలు మన మెందుకు వ్రాయడ మనుకో లేదు! మన మెందుకు వ్రాయకూడ దనుకొన్నట్లుగా తోస్తుంది ఆ కావ్యం చదివితే-

పాడలి ఒక చారిత్రక ప్రదేశంకాదు. పలురకాల పుక్కిటికథల పుట్ట. అనే భావం మనకు కలుగుతుంది దానిని తమ అపారకవితాశక్తితో పైకెత్తుతారు శ్రీ నాయనివారు. ఇది చదివిన తరువాత ఎవరికైనా ఒకసారి పాడలి వెళ్ళి చూడాలని పిస్తుంది. ఈ క్రింది పద్యం ఆయన 'జన్మభూమి'లో పండించిన కవితకు నిదర్శనం

'అనగా నిందిర పూతకొత్తిమెరచే
  నైనన్యా; నన్వైన్ నదా
తనకుడున్ విచ్చిన పండ్లబూరుగయి త
  ద్దాసద్వయమ్మెకమై
తెనుగన్ సాస్కృతముల్ పరస్పరసౌ
  శ్నేకమ్ముతో మేళగిం
చిన కావ్యాత్మగతిన్ జగమ్ము లలరిం
  చెన్ నిత్యమాంగల్యమై'

ముదరపండిన కావ్యవాసనతో పాటు నాయనివారి వృత్తవైవిధ్యం పరితలను 'ఓహో!' అన్నరీతిలో ఆకర్షించినది. వృత్తాలతో బంతులాడినట్లు తోస్తుంది. ఆయన తనశక్తిని సానబెట్టి పరీక్షించుకొన్నట్లు వ్యక్తమౌతుంది.

తెలుగు మాగాణంలోపుట్టి తెలుగు సాహిత్యంలో పెరిగి, చారిత్రక కరుణ ప్రణయ కవితాధురంధరులైన నాయని వారు లేనిలోటు కొన్ని తరాలవరకు తీరదు.

'నదులు ఎండిపోవును
నూతులు పూడిపోవును
దేవాలయాలు శిథిలమగును
చరిత్ర మాసిపోవును'

కాని-

'కవిత్వము బ్రతుకుతుంది'

- అన్నమాటలు నాయని వారిపట్ల యథార్థం.

'జయంతి తే సుకృతినో రససిద్ధాః
  కవీశ్వరాః
నాస్తి తేషాం యశఃకాయే జరామరణజం
  భయమ్'

—...—

## కనుపించదు తెలుగుదనము

శ్రీ మామిండ్ల రామగౌడు.

తెలుగుగడ్డపై బుట్టిన
తెలుగు బిడ్డ తెలిసికొనుము
తెలుగుల వెలుగుల సంస్కృతి
తెలుగుభాష తీయదనము

తెలుగుజాతిరీతి మఱచి
తెలుగుఖ్యాతి నీతి విడచి
పరదేశపు ముసుగు వేసి
దొరల వేషములను దాల్చి

'హాఫ్టరాలు' తెలుగటంచు
నపహసించు తెలుగువాని
నాల్కగోసి నాల్గు మొట్టి
నను పాపము లేదు సుమ్మి!

పంచెనుగని పరిహసించు
'ఫాంటు'నుగని సంతసించు
కండువాల కన్నను 'టై'
గట్టినచో తలను వంచు

'మమ్మీ డాడీల' విలువ
అమ్మ నాయనలకు లేదు
పరభాషా వేషమ్ముల
వ్యామోహము తగ్గలేదు

కట్టు బొట్టు జుట్టులందు
'కాన్వెంటు'ల యాచారము
కాగడాల బట్టి వెదక
కనిపించదు తెలుగుదనము

మన నన్నయ, తిక్కన, పో
తన లనువాదపు కవులట
అసలు తెలుగుభాషా కా
వ్యమ్ము లెచట కనరా వట

షేక్స్పియరు నాటకముల
చేవను గొనియాడుచుండు
కాళిదాసు కవిత్వములను
తూలనాడి పలుకుచుండు

కమలముపై దూకునట్టి
కప్పలు తేనెను గ్రోలవు
తెలుగు దేశమున జనించి
నను కొందఱు విలు వెఱుగరు

తెలుగు కావ్య సుధాంబునిధిని
తేలియాడి తెలుగు శబ్ద
రత్నమ్ముల గూర్చుకొనుము
రసహృదయా! నేర్చుకొనుమా.

—•••—

## చెట్టు

సాహిత్యరత్న పి. వి. ఎల్. సుబ్బారావు,
ఎం.ఏ., బి.ఎస్‌సి., బి.ఇడి.

తాను ఎండను భరిస్తూ,
పరులకు నీడను అందిస్తూ,
ఏనాటినుండో, ఈనాటి వరకూ,
ఎండలో కాగి, వేడిని చవిచూచిన
చెట్టు ఒకటి,
తానింత చల్లదనం కోరుకుంటే
అది వచ్చేది ఎప్పుడు?

తూర్పున ఉదయించిన సూర్యుడు,
పడమటను అస్తమించినపుడా!
జీవితం లాంటి వెలుగు అంతరించి,
మరణంలాంటి చీకటి అలముకొన్నపుడా!

ఆ చెట్టుగూళ్ళలో నోళ్ళు తెరచినపక్షులు,
రెక్కలు రాగానే రివ్వున ఎగిరి
పోయాయి,
ఆనీడలో సేదదీరిన మనుష్యుల మనసులు,
నీడ అనవసరం అనుకున్నాక మారి
పోయాయి,
నిట్టూర్పు నిధిగా మిగుల్చుకున్న చెట్టు
తనకు చల్లదనం చీకటిలోనే అనుకుంది.

ఆరోజు పౌర్ణమి,
వెన్నెల వెలుగులో తళతళలాడే ఆకువు,
వయసు మెరుగుతో కళకళలాడే నవవధువు,
మొదటిసారిగా తననీడని చూసుకున్న,
చెట్టు 'ఇంత అందమైనదాన్నా!'
అనుకుంది.

క్షణభంగురమైన జీవితంలో,
అరక్షణం గడిచేసరికి, మిగతా
అరక్షణంపై నీకుందా 'అధికారం'
నాకే చేస్తావా 'ధిక్కారం' అని
అడుగుతుంది.
కంటికి కనిపించని విధి.

అందుకే ఆ అర్ధక్షణంలో
వెన్నెల అంతరించి, కారుచీకట్లు ఆవరించి
గాలి, వర్షం చెలిమి చేసికొని,
తుపానుగా మారి, చెట్టును కూలదోశాయి, (?)
తుపాను వెళ్ళిపోయింది,
దెబ్బతీసి పారిపోయిన దొంగలా.

నేలబడిన చెట్టుకున్న
వారను అందరు వేగంగా వచ్చారు.
సానుభూతి చూపించడానికి కాదు,
'ఏభాగం పనికివస్తుందో'
'ఎవరికెంతెంత వస్తుందో'
తెలుసుకోవడానికి, వాటాలు
తేల్చుకోవడానికి.

ప్రతిచెట్టుకి ఒక పేరు ఉంటుంది,
ఈచెట్టుకీ పేరు ఉంది – మనిషిచెట్టు.

—•••—

## భావవిహారీ!

శ్రీమతి కమలాదేవి.

పరువిడు కాలము చూడుము
పరువపు గరువము విడువుము భావవిహారీ!
తెరువరి గమ్యము చేరగ
చురుకుగ నడువక దెసలను చూచుట
మేలా?

చేదోడు ఉండుదు నని
నీ దారి సుగమ మగు నని నెమ్మది పలుకున్
నా దని నీ దని మురియుచు
ఏదో నాటికి సమస్త మెడబాయవలెన్

ఎవరో వత్తురు మనగతి
అవలోకింతురు మనసున కానందముగా
సువిలాసము సమకూర్చెద
రవనీ పతుల నెడు నట్టి ఆశను విడుమా!

స్వార్థపరచకు క్షణమైన వ్యసనములకు
అన్ని సంతోషదశలు 'అశాశ్వతములె'
ఎంత మోహనులైన నియంతలైన
కాలగర్భాన కలసిన కథలు వినమె?

ప్రేమ నభిలషింపుము చెలీ! వేసరిలకు
దురభిమానము ప్రేమకు దూరభూమి
గమ్య మేగాన నీబాట రమ్యమగును
భూతదయ మది నింపుమా పుణ్యశీల? *

—•••—

# "సమాలోచన" ద్వితీయ సంపుట రచనల పట్టిక


| రచన, రచయిత | సంచిక నంబరు |
|---|---|
| 1. అందని చిఱునవ్వు (పద్య)<br>శ్రీ అద్దేపల్లి రామమోహనరావు | 1 |
| 2. అక్షరకాంతి (పద్య)<br>శ్రీ కవిగణపతి | 1 |
| 3. అగ్నిచిత్రం (గేయ)<br>శ్రీ కుమారి పసుమర్తి పద్మజవాణి | 5 |
| 4. అదృష్టము (పద్య)<br>శ్రీ జమదగ్ని | 18 |
| 5. అనివార్యం (పద్య)<br>శ్రీమతి కమలాదేవి | 12 |
| 6. అన్యదేశ్యములు<br>శ్రీ యస్ రాజశేఖర్ | 1 |
| 7. అపరిచిత (పద్య)<br>శ్రీమతి కమలాదేవి | 12 |
| 8. అమాయికులు (పద్య)<br>శ్రీ శ్రీధర సత్యవెంకట సుబ్రహ్మణ్యశాస్త్రి | 2 |
| 9. అసమర్థుని జీవయాత్ర-హేతువాద నిరాసము<br>శ్రీ డా. యం శ్రీరామమూర్తి | 2 |
| 10. ఆంధ్రమున ఆంగ్లపరిణామం<br>శ్రీ శిరీష | 11 |
| 11. ఆచార్య యస్వీ 'అప్సరస'<br>శ్రీ కట్టా కార్తికేయశర్మ | 22-23 |
| 12. ఆటపాటల మేటి అష్టావధానాలు<br>శ్రీ క్రొవ్విడి రామం | 12 |
| 13. ఆనంద గజపతి - సమస్యాపూరణము<br>శ్రీ క్రొవ్విడి రామం | 18-20,21 |
| 14. ఆనంద మందిరము (పద్య)<br>శ్రీ బులుసు వేంకటేశ్వరులు | 2 |
| 15. ఆపాదమస్తక వర్ణనము<br>శ్రీ భారతీప్రియ | 5 |
| 16. ఆముక్తమాల్యద - రాయలరచనా వైశిష్ట్యము<br>శ్రీ ధూర్జటి వెంకట బాలాజీ | 4 |
| 17. ఆర్యాశతకము గ్రంథ విమర్శ<br>శ్రీ సుప్రసన్న | 8 |
| 18. ఆవేదన (పద్య)<br>శ్రీ లోలభట్టు శివరామ కృష్ణరాజు | 16.18 |
| 19. ఇన్ ఖిలాబ్ కవి ఇఖ్బాల్<br>శ్రీ మత్తి విజయరావ్ | 24 |
| 20. ఇపుడు (పద్య)<br>శ్రీ గాదేపల్లి కుక్కుటేశ్వర రావు | 1 |
| 21. ఉగాది కోరిక (పద్య)<br>శ్రీ బులుసు వేంకటేశ్వరులు | 11 |
| 22. ఋతువర్ణనము (పద్య)<br>శ్రీ నిశాపతి | 2<br>2 |
| 23. ఋతుసూక్తము (గ్రం. వి.)<br>శ్రీ సుగుణారాధక | 4 |
| 24. ఏకవీరలో ప్రతీకలు - ఒక పరిశీలన<br>శ్రీ సుంకిరెడ్డి నారాయణరెడ్డి | 18-20 |
| 25. ఏణరాజు (గ్రం. వి.)<br>శ్రీ ప్రసాద్ | 2 |
| 26. ఏణరాజు గ్రంథ సమీక్షపై లేఖ<br>శ్రీ లంకా లక్ష్మీనరసింహశర్మ | 5 |
| 27. ఏణరాజు గ్రంథ సమీక్షపై లేఖకు సమాధానం<br>శ్రీ ప్రసాద్ | 5 |
| 28. ఏరువాక మహోత్సవము (పద్య)<br>శ్రీ జయంతి వెంకటశాస్త్రి | 1 |
| 29. ఏసు కృష్ణీయము<br>శ్రీ గాదేపల్లి కుక్కుటేశ్వరరావు | 11 |
| 30. కద్రూవినతల ఘట్టము-కొన్ని ప్రసన్న విశేషాలు<br>శ్రీ మైలవరపు శ్రీనివాసరావు | 4,5,6 |

| రచన, రచయిత | సంచిక నంబరు |
| --- | --- |
| 31. కన్నీళ్లు (గేయ)<br>శ్రీ పి. పద్మజావాణి | 13 |
| 32. కవికళాదులు<br>శ్రీ కపిలవాయి లింగమూర్తి | 10 |
| 33. కవికొండల వారి ప్రకృతి గీతములు<br>శ్రీ డా. జి. వి. యస్. ఆచార్య | 12, 13 |
| 34. కవిగాడప్ప శతకం (గ్రం. వి)<br>శ్రీ ప్రసాద్ | 14 |
| 35. కవితావతరణము (పద్య)<br>శ్రీ వారణాసి వెంకటేశ్వర్లు | 7 |
| 36. కవిత్వంలో నవత్వం<br>శ్రీ సోమ సుందర్ | 16-17 |
| 37. కవిత్వమొక తీరని దాహం<br>శ్రీ సోమసుందర్ | 7 |
| 38. కవిరాజ శిఖామణి కవితాహేల<br>శ్రీ డా. అయ్యగారి నరసింహమూర్తి | 8 |
| 39. కవి స్వాగతము (పద్య)<br>శ్రీ డి. వి. మురళీ మోహనాచార్య | 3 |
| 40. కవి - విమర్శకుడూ ఆధునిక సాహిత్యానికి రెండుకళ్ళు<br>శ్రీ సోమసుందర్ | 18-20 |
| 41. కాకి (గేయ)<br>శ్రీ చింతలపూడి వెంకటేశ్వర్లు | 11 |
| 42. కావ్యహేతువులు<br>శ్రీ చక్రవర్తుల రామానుజాచార్యులు | 22-23 |
| 43. కుందమాల (గ్రం. వి)<br>శ్రీ ప్రసాద్ | 9 |
| 44. కుమారసంభవము (గ్రం.వి.)<br>శ్రీ ప్రసాద్ | 24 |
| 45. కైకేయి (గ్రం. వి)<br>శ్రీ ప్రసాద్ | 8 |
| 46. కొన్ని ప్రయోగాలు-ఒక వివరణ<br>శ్రీ యల్. కె. మల్లేశ్వరరావు | 11 |
| 47. గంగావతరణము (పద్య)<br>శ్రీ కావూరి పూర్ణచంద్రరావు | 8 |
| 48. గాలిబ్ గీతాల్లో చమత్కారం<br>శ్రీ సుంకిరెడ్డి నారాయణరెడ్డి | 11 |
| 49. గాలిరథంలో వాడు వచ్చిన కథ బదిలీ<br>శ్రీమతి ఎస్. ఎ. ఎస్. కుమారి | 12 |
| 50. గులాబి (పద్య)<br>శ్రీ చల్లా నరసింహారావు | 10 |
| 51. గులాబీ విలాపం (పద్య)<br>శ్రీమతి జి. కమలా రాఘవన్ | 2 |
| 52. గ్రీష్మాటోపము (పద్య)<br>శ్రీమతి జి. కమలారాఘవన్ | 18 |
| 53. చంద్రకళ (పద్య)<br>శ్రీ ప్రొ. యస్వీ జోగారావు | 1 |
| 54. చంపకమాల<br>శ్రీ డా. గంటి శ్రీరామమూర్తి | 8 |
| 55. చమత్కారమంజరి<br>శ్రీ యస్. రాజశేఖర్ | 8 |
| 56. చేమకూర వేంకటకవి సారంగధర చరిత్రము<br>శ్రీ డా. యస్. గంగప్ప | 9 |
| 57. చైత్రవంది (గ్రం. వి)<br>శ్రీ సుగుణారాధక | 1 |
| 58. జానపద విజ్ఞానము-తెలుగు జానపద సాహిత్యము<br>శ్రీ డా. జి. యస్. మోహన్ | 24 |
| 59. జాషువా కవిత - ఒక పరిశీలన<br>శ్రీ చక్రవర్తుల రామానుజాచార్యులు | 2 |
| 60. జ్యోతిర్మయి (గ్రం. వి.)<br>శ్రీ కుప్రసన్న | 4 |
| 61. తత్త్వాదర్శము (పద్య)<br>శ్రీ జమదగ్ని | 5 |
| 62. తల్లీ నిన్నుఁ దలంచి<br>శ్రీ భారతీ ప్రియ | 14 |
| 63. తిక్కన మోక్ష నిర్వచనము<br>శ్రీ ఎం. కృష్ణస్వామి | 7 |
| 64. తెలుగు కవితలు - సంప్రదాయపు ఛాయలు<br>శ్రీ మట్టి వెంకట నరసింహారెడ్డి | 13 |
| 65. తెలుగు కవితాతత్త్వం<br>శ్రీ ఎం. కృష్ణప్రసాద్ | 5 |

| రచన, రచయిత | సంచిక నంబరు |
|---|---|
| 66. తెలుగు కవితకు జీవంపోసిన క్షేమేంద్ర<br>శ్రీ డా. గంగిరాల వెంకట సుబ్బారావు | 7, 8 |
| 67. తెలుగునాటి వ్యావహారిక భాష<br>శ్రీ ఎల్. కె. మల్లేశ్వరరావు | 14, 15 |
| 68. తెలుగురాజులు - సంస్కృత భాషాసేవ<br>శ్రీ వెలుదండ నిత్యానందరావు | 24 |
| 69. తెలుగు రుబాయీలు<br>శ్రీ కవిగణపతి | 5, 7 |
| 70. తెలుగులో కథాకావ్యములు<br>శ్రీ కశవరపు వెంకటరామయ్య | 2, 3 |
| 71. తెలుగులోని పదములు - పూర్వోత్తరములు<br>శ్రీ మ. సుబ్రహ్మణ్యశర్మ | 8 |
| 72. తెలుగువారి గాదిలి ఉగాది (పద్య)<br>శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి | 11 |
| 73. త్యాగరాజు<br>శ్రీ కె. రామకృష్ణ | 24 |
| 74. త్రిమూర్తులు<br>శ్రీ మఱ్ఱి వెంకట నరసింహారెడ్డి | 8<br>8 |
| 75. దక్షారామము (పద్య)<br>శ్రీ శనగన నరసింహస్వామి | 1 |
| 76. దక్షిణ కైలాస విశేషములు (పద్య)<br>శ్రీ జమదగ్ని | 22-23 |
| 77. దిగంబర కవిత్వం ఒక సాహిత్య ఉద్యమం అనవచ్చునా?<br>డా. పి. యల్. నరసింహారావు | 4,5 |
| 78. దీనరక్షక శతకము (గ్రం. వి)<br>శ్రీ ప్రసాద్ | 13 |
| 79. దౌత్యము (పద్య)<br>శ్రీ జయంతి వేంకట శాస్త్రి | 22-23 |
| 80. ద్రౌపది ధర్మాద్వైత స్థితి<br>శ్రీ ఎం. వి. కృష్ణస్వామి | 9,10 |
| 81. నన్నయ జయంతి ప్రసంగంపై లేఖ<br>శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి | 4 |
| 82 నన్నయ జయంతి ప్రసంగపై లేఖకు సమాధానం<br>సంపాదకుడు | 4 |
| 83. నమ్మకము (పద్య)<br>శ్రీ జమదగ్ని | 18-20 |
| 84. నవనవోన్మేషము (పద్య)<br>శ్రీ తంగుడిగ శ్రీధరరావు | 3 |
| 85. నవరత్నమాల (పద్య)<br>శ్రీ ఆర్. యం. చల్లా | 1 |
| 86. నవలా సాహిత్యము-లత<br>శ్రీ కుమారి తుర్లపాటి రాజేశ్వరి | 11, 12 |
| 87. నవలా సాహిత్యము - శ్రీమతి రంగనాయకమ్మ<br>శ్రీ కుమారి తుర్లపాటి రాజేశ్వరి | 18-20, 21, 22, 23 |
| 88. నవ్యకవితా యుగ[illegible]య శ్రీ-ఉదయశ్రీ<br>శ్రీ డా. జి. బి. యస్. ఆచార్య | 21, 22-23<br>12 |
| 89. నాటక సమీక్ష (గ్రం. వి.)<br>శ్రీ సుగుణారాధక | |
| 90. నాదృష్టిలో గురజాడ సృష్టి<br>శ్రీ ధూర్జటి వెంకటబాలాజీ | 9, 10 |
| 91. నిస్స్వార్థ కళా తపస్వి<br>శ్రీ గత్తెపల్లి సత్యనారాయణరాజు | 1 |
| 92. నీలకంఠేశ్వరా (పద్య)<br>శ్రీ కవిగణపతి | 6 |
| 93. నూతలపాటి గంగాధరం<br>శ్రీ కల్రా కార్తికేయశర్మ | 5, 6 |
| 94. నూతలపాటి కవితావధూటి<br>శ్రీ యస్. రాజశేఖర్ | 14, 15 |
| 95. పద్యానికి విలువ ఉన్నదా?<br>శ్రీ సుప్రసన్న | 1 |
| 96. పరం కవీనామాధారం<br>శ్రీ మధునాపంతుల సత్యనారాణ శాస్త్రి | 1 |
| 97. పల్లె పడుచు (పద్య)<br>శ్రీ జి. యం. రామశర్మ | 10 |
| 98. పసిపాప-పరిరక్షణ (పద్య)<br>శ్రీ బులుసు వేంకటేశ్వర్లు | 15 |
| 99. పురాణదంపతులు<br>శ్రీ కపిలవాయి లింగమూర్తి | 4 |
| 100. పురుషార్థసుధానిధి (కథలు-అనువాదము)<br>సంపాదకుడు | 2,10,14 |
| 101. పోతనభాగవతము - ఒక పరిశీలనము<br>శ్రీ డా. సేతి అనంతరామ శాస్త్రి | 1 |

| రచన, రచయిత | సంచిక నంబరు |
|---|---|
| 102. ప్రకృతిలీల - ఋతుహేల<br>శ్రీ డా. జి. బి యస్. ఆచార్య. | 7,8,9 |
| 103. ప్రబంధకవులు - స్త్రీవర్ణన<br>శ్రీ కపిలవాయి లింగమూర్తి | 1 |
| 104. ప్రబంధాల్లో పద్యశిల్పం<br>శ్రీ కపిలవాయి లింగమూర్తి | 9 |
| 105. ప్రసన్న కుసుమాయుధము - తత్త్వదర్శనము<br>శ్రీ శివలెంక ప్రకాశరావు | 12, 13, 14, 15 |
| 106. ప్రసిద్ధ హిందీ కావ్యం కామాయని విశిష్టత<br>శ్రీ బి. వి. రమణ | 4,5 |
| 107. ప్రాకృతగాథలు (పద్య)<br>శ్రీ డా. అయ్యగారి నరసింహమూర్తి | 1 |
| 108. ప్రాజ్ఞన్నయ యుగము - సాంఘిక జీవనము (గ్రం. వి.)<br>శ్రీ ప్రసాద్ | 15 |
| 109. ప్రాచీన కవులకు సామాజిక స్పృహ లేదా?<br>శ్రీ ఎం. కృష్ణస్వామి | 18-20 |
| 110. ప్రేక్షచ్ఛాత్రులు (పద్య)<br>శ్రీ కర్రా చంద్రశేఖరశాస్త్రి | 1 |
| 111. ప్రేయసి (పద్య)<br>శ్రీ నిశాపతి | 7 |
| 112. బిడాలమోక్షము గ్రం. వి<br>శ్రీ ప్రసాద్ | 1 |
| 113. బ్రతుకు లోతులు (పద్య)<br>శ్రీ మామిండ్ల రామగౌడు | 15 |
| 114. Beauty of the poet గ్రం. వి.<br>శ్రీ సంఘమిత్ర | 1 |
| 115. భగవద్గీత<br>శ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి | 11 |
| 116. భగ్నవీణ (పద్య)<br>శ్రీ అవధానం రంగనాథ వాచస్పతి | 10 |
| 117. భారతమాత (పద్య)<br>శ్రీమతి విక్రాల శ్రీదేవమ్మ | 5 |
| 118. భాస్కరోప గ్రహాస్య ప్రస్తుతిః (శ్లోక)<br>శ్రీ ఆర్. యం. చల్లా. | 21 |
| 119. భీష్మచరిత్ర గ్రం. వి<br>శ్రీ ప్రసాద్ | |
| 120. మధ్యమాంబా గరీయసీ<br>శ్రీ. డా. అయ్యగారి నరసింహమూర్తి | 15, 16-17 |
| 121. మన కర్ణునికథ<br>శ్రీ భారతీప్రియ | 21, 22-23 |
| 122. మరో ప్రపంచం కోసం గ్రం. వి.<br>శ్రీ యస్. రాజశేఖర్ | 11 |
| 123. మాఘుని కావ్యనిర్మాణ దక్షత<br>శ్రీ డా. శ్రీ చేతి అనంతరామశాస్త్రి. | 8, 9 |
| 124. మాతృవందనము (పద్య)<br>శ్రీ తంగుడిగె శ్రీధరరావు | 16-16 |
| 125. మానె ప్రో ప్రిజం<br>శ్రీ భమిడిపాటి అనంతశర్మ | 22-23 |
| 126. మిథ్య (గేయ)<br>శ్రీ కోడూరి శ్రీధర్ | 11 |
| 127. మురళి (పద్య)<br>శ్రీ సామంతపూడి కమలనాథ్, దశరథరామరాజు | 5 |
| 128. మోక్షశాస్త్రంలో కామశాస్త్రం<br>శ్రీ కపిలవాయి లింగమూర్తి | 5 |
| 129. ప్రోడు మొలు (పద్య)<br>శ్రీ మామిండ్ల రామగౌడు | 12 |
| 130. రష్యా విప్లవకవి మైకోవిస్కీ<br>శ్రీ ఇ. టి. లోకనాథరావు | 4, 6, 7 |
| 131. రసిక్ కూనలమ్మ పదాలు<br>శ్రీ యస్. రాజశేఖర్ | 8, 9 |
| 132 రాజమహేంద్రవర ప్రశస్తి (పద్య)<br>శ్రీ యస్. వి. రాఘవేంద్రరావు | 12 |
| 133. రామకృష్ణుని కవిత - వాస్తవికత<br>శ్రీ మల్లి వెంకట నరసింహారెడ్డి | 1 |
| 134. రాళ్లపల్లి పీఠికలు - ఒక సమీక్ష<br>శ్రీ డా. జి. యస్. మోహన్ | 11 |
| 135. రాళ్ళపల్లి రచనా రామణీయకత<br>శ్రీ కలవరపు వెంకటరామయ్య | 22-23,24 |

| రచన, రచయితలు | సంచిక, నంబరు |
|---|---|
| 136. రాళ్ళపల్లివారికి శ్రీవారి పిలుపు<br>శ్రీ బాడాల రామయ్య | |
| 137. రాష్ట్రపూజ<br>శ్రీ జి. వి. యస్. ఆచార్య | |
| 138. వర్షాభ్యుదయము (పద్య)<br>శ్రీమతి జి. కమలారాఘవన్ | 21 |
| 139. వలపుఁ జిలుక (పద్య)<br>శ్రీ తంగుడిగ శ్రీధరరావు | 9 |
| 140. వలపు నెత్తురు (పద్య)<br>శ్రీ యస్. శ్రీనివాసులు | 13 |
| 141. వసంతగీతి (పద్య)<br>శ్రీ జి. యం. రామశర్మ | 13 |
| 142. వసంతవాల్లభ్యము (పద్య)<br>శ్రీమతి జి. కమలారాఘవన్ | 11 |
| 143. వారసత్వం (గేయ)<br>శ్రీ శ్రీరామ్ | 12 |
| 144. వాల్మీకి రామాయణం గ్రం. వి<br>శ్రీ ... ... | 13 |
| 145. విద్యాలోకము (పద్య)<br>శ్రీ డా. వి. వి. యల్. నరసింహారావు | 1 |
| 146. విమర్శవేదిక గ్రం.వి.<br>శ్రీ సుగుణారాధక | 16_17 |
| 147. విశ్వనాథవారి అద్భుత సృష్టి కడిమిచెట్టు<br>శ్రీమతి శిరీష | 22_23 |
| 148. విశ్వనాథవారి సాహిత్య విమర్శ<br>శ్రీ శిరశెంక ప్రకాశరావు | 4,5,6,7,8,9,10 |
| 149. విశ్వశ్రేయః కావ్యం<br>శ్రీ సోమసుందర్ | 14 |

| రచన, రచయితలు | సంచిక, నంబరు |
|---|---|
| 150. విశ్వేశ్వర శతకం (గ్రం. వి.)<br>శ్రీ ప్రసాద్ | 11 |
| 151. వీడికోలు (పద్య)<br>శ్రీ యస్. వి. రంగనాథస్వామి | 15 |
| 152. వేణీసంహారం (గ్రం. వి.)<br>శ్రీ ... ... | 5 |
| 153. వేణీ సంహారము _ నాయకుఁడు<br>శ్రీ డా. నేతి అనంతరామశాస్త్రి | 6 |
| 154. వేదన (పద్య)<br>శ్రీ రాణి శివశంకరశర్మ | 9 |
| 155. వేదాలు పౌరుషేయాలా<br>శ్రీ మైలవరపు శ్రీనివాసరావు | 1 |
| 156. వేములవాడ భీమకవి పూర్వాశ్రమంలో మల్లెయ రేచనా?<br>శ్రీ చింతలపూడి వేంకటేశ్వర్లు | 16_17 |
| 157. వేసవివర్ణన_శ్రీకృష్ణరాయలు_రఘునాథరాయలు<br>శ్రీ డా. యస్. గంగప్ప | 13 |
| 158. వైకుంఠపాళి (గేయ)<br>శ్రీ కోడూరి శ్రీధర్ | 9 |
| 159. వైరభక్తి (గ్రం. వి.)<br>శ్రీ గౌతమ | 7 |
| 162. శంతనుఁడు (పద్య)<br>శ్రీ కావూరి పూర్ణచంద్రరావు | 3 |
| 161. శరత్ జీవితం_సాహిత్యం<br>శ్రీ యస్. వి. | 1 |
| 162. శరన్నీరాజనము (పద్య)<br>శ్రీమతి జి. కమలా రాఘవన్ | 24 |
| 163. శాకుంతలోత్తర రామచరితములు<br>శ్రీమతి కుసుమ | 15,16_17 |

| రచన, రచయితలు | సంచిక, నంబరు |
|---|---|
| 64. శివభారతము_సమాలోచన<br>శ్రీ టి. భాస్కరరావు | 71 |
| 165. శిలాస్వగతము (పద్య)<br>శ్రీ చల్లా రాధాకృష్ణమూర్తి | 3 |
| 166. శ్రీనాథుఁడు (గ్రం. వి.)<br>శ్రీ డా॥ అయ్యగారి నరసింహమూర్తి | 18_20, 21,22_23 |
| 167. శ్రీనాథుని భాష - నుడికారం<br>శ్రీ డా. నేతి అనంతరామశాస్త్రి | 2 |
| 168. శ్రీశ్రీ కవిత్వంలో హాస్యం<br>శ్రీ యస్. రాజశేఖర్ | 21 |
| 169. శ్రీశ్రీ కవిత్వం - వస్తువు, సంవిధానం<br>శ్రీ డా. మిరియాల రామకృష్ణ | 3 |
| 170 శ్రీశ్రీ ప్రకృతి గీతములు_ఒక పరిశీలన<br>శ్రీ డా. జి. వి. యస్. ఆచార్య | 10 |
| 171. శ్రీమత్కవి కర్ణరసాయన సకల వర్ణనాపూర్ణ రామాయణము<br>శ్రీ డా. చలపతి | 15 |
| 172. శ్రీశ్రీ మహాప్రస్థానం<br>శ్రీ కట్టా కార్తికేయశర్మ | 12 |
| 173. శ్రీవాణీ సమానవర్ణనము<br>శ్రీ విద్రాల శేషాచార్యుః | |
| 174. షడ్దర్శనము (గ్రం. వి.)<br>శ్రీ ... ... | 15 |
| 175. సమయబలం (పద్య)<br>శ్రీ చల్లా నరసింహారావు | 15 |
| 176. సమాజ నిర్మాణంలో రచయితల పాత్ర<br>శ్రీ డి. మనోహరరావు | 12 |
| 177. సాహిత్యంలో హేమంతం<br>శ్రీ కలవరపు వెంకటరామయ్య | 5,6,7,8 |
| 178. సాహిత్య తపస్వి<br>శ్రీ బులుసు వెంకటేశ్వరులు | 10 |
| 179. సాహిత్యము - సమకాలీన ఇతివృత్తము<br>శ్రీ ఎం. కృష్ణస్వామి | 16_27 |
| 180. సాహితీ సుధాలహరి (గ్రం. వి.<br>శ్రీ ... ... | 10 |
| 181. సాహిత్యరమణి (పద్య)<br>శ్రీ చింతలపూడి వేంకటేశ్వరులు | 15 |
| 82. సాహిత్య లక్ష్యం<br>శ్రీ ఆర్. యస్. సుదర్శనం | 11 |
| 183. సుఖసేవధి (పద్య)<br>శ్రీ చల్లా నరసింహారావు | , 81,87 |
| 184. స్త్రీల పాటలలో అప్పగింతలు<br>శ్రీమతి శిష్టా లక్ష్మీనరసమ్మ | 17_17, 18_20 |
| 185. స్వర్ణాయతనము (పద్య)<br>శ్రీ తంగుడిగె శ్రీధరరావు | |
| 186. స్వాతంత్ర్యానంతరం తెలుఁగు నవలా వికాసం<br>శ్రీ సోమసుందర్ | 1,2,3 |
| 187. స్వార్థకేళి (గేయ)<br>శ్రీ కె. మోహనరావు | 10 |
| 188. హిందీ కవి జయశంకర ప్రసాద్<br>శ్రీ హెచ్. ఎం. ఎస్, కామేశ్వరరావు. | 21 |

వివిధ సాహిత్య విషయాలకు చెందిన సుమారు నూట ఎనిమిది రచనలతో గూడిన 'సమాలోచన' ద్వితీయ సంపుటము 24 సంచికలు ఒకే వాల్యూముగా హాఫ్ క్యాలికో బైండు చేయబడి అమ్మకమునకు సిద్ధముగా నున్నవి. రు 18/లు M.O. ద్వారా పంపినవారికి పోస్టుఖర్చులు మేమే భరించి రిజిష్టరు పోస్టులో పంపగలము.

మొదటి సంపుటము వాల్యూములు కూడ కొలదిగా ఉన్నవి. 18 రూలు M.O. ద్వారా పంపినవారికి మొదటి సంపుటము 2 వాల్యూములుగా రిజిష్టరు పోస్టులో పంపగలము.

— సంపాదకుడు.

# స్వవిషయం



సమాలోచనకు రెండు సంవత్సరములు నిండి మూడవసంవత్సరం వచ్చినది. పేపరు ధర విపరీతంగా పెరిగిపోవడం, ప్రెస్సు వర్కర్ల సమస్యలు, సంపాదకుడు స్వకీయ కార్యనిర్వహణవ్యగ్రతచే ఎక్కువ శ్రద్ధ పత్రిక విషయంలో చూపలేకపోవడం అనే ప్రతికూల పరిస్థితుల్ని తట్టుకుని ఈవిధంగా మూడవసంవత్సరంలో అడుగిడినది. అనుకున్న ఆశయాలన్నీ నెఱవేఱక పోయినా నిరాశోపహతి చెందనక్కర లేని సంతృప్తిలోనే నిర్వహణ జరిగినదని భావిస్తున్నాను.

ఈవిధంగా పత్రిక కొంతవఱకూ జయప్రదం కావడానికి పాఠకులు ముఖ్యంగా రచయితలు ఇచ్చిన ప్రోత్సాహం గణనీయం, ప్రశంసనీయం. ఆసించినంతగా సహపత్రికల సహకారం మాత్రం లభించలేదని భావింపవలసి వచ్చుచున్నది. అందుకు తగునట్లు యత్నలోపము లేకుండా కృషిచేస్తూ క్రమంగా ఇంకా ఉన్నత స్థాయిలో పత్రికను నడపడానికి ప్రయత్నిస్తాననీ ఇతోధికంగా వివిధ రచయితలు తమ అమూల్య సహకారం అందిస్తారని ఆశిస్తున్నాననీ సవినయముగా మనవిచేసి కొనుచున్నాను.

## —* రాజకీయ సంచలనం *—

ఎమర్జన్సీ దుష్పరిపాలన వ్యాజంలో స్వాతంత్ర్యం వచ్చినప్పటినుంచీ పరిపాలనలోఉన్న ప్రభుత్వం గత ఎన్నికలలో చిత్తుగా ఓడిపోయి జనతాపార్టీ అధికారంలోకి వచ్చింది. ప్రజాహిత పరిపాలన, కలిగి శాంతిసౌఖ్యాలు వర్ధిల్లుతా యని కొండంత ఆశతో జనానీకం తన ఓటుహక్కును విప్లవాత్మకంగా వినియోగించడం జరిగింది. ఫలితం 28 నెలల పరిపాలన తర్వాత సామాన్యజనానికి ఏ ఒక్క మేలు చేయలేనిదయి అధికారపక్షం ఛిన్నా భిన్నంకావడం. ఇందు తప్పెవరిదీ అంటే తన ఒక్కడిదీతప్ప ఎదుటి వారందరిదీ తప్పని ప్రతి ఒక నాయకునికి గాఢవిశ్వాసం.

అప్పటికి పార్లమెంటు సభ్యులలో ఎక్కువమంది మద్దతు గలిగియున్నట్లు స్పష్టముగా గమనించి రాష్ట్రపతిచే ప్రధానిగా శ్రీ చరణ్ నియమింపబడడం, తమ మద్దతు ప్రభుత్వ స్థాపన మాత్రమునకే కాని ప్రభుత్వము పనిచేయడానికి కాదని ఇందిరావర్గీయులు సహాయ నిరాకరణం చేయడం, శ్రీచరణ్ మంత్రివర్గం రాజీనామాచేసి ఎన్నికలవఱకు పనిచేయుటకై రాష్ట్రపతిచే కోరబడి ప్రస్తుతం పనిచేస్తూండడం ఇదీ ఇప్పటి వఱకూ జరిగిన రాజకీయ వ్యవహార సరళి.

మధ్యంతరఎన్నికలు 1980 జనవరి మొదటి వారంలో జరపుటకు సన్నాహాలు పూర్తియగుచున్నవి. ఈ లోగా రాజకీయనాయకుల పార్టీ

మార్పిడులు విశృంఖలంగా జరుగుచున్నవి. ఈ అన్యమత ప్రవేశానికి ఒక్కటే ముఖ్యసిద్ధాంతంగా కన్పడుతోంది. 'ఏమతం పుచ్చుకుంటే, ఏ శంఖోదకం పానంచేస్తే, నాకు, నాకుటుంబానికి, లాభిస్తుంది?' అత్యున్నత శ్రేణి నాయకుల దగ్గరి నుండి క్రింది తరగతి ఛోటానాయకుల వరకూ ఇదొక్కటే తారకమంత్రం అయిపోయింది. సిద్ధాంతాలకి బద్ధులైన నీతిమంతులే కొలదిమందో ఉన్నా వారేవిధంగానూ పైకి రాలేక పోతున్నారు.

ఈ ధ్యేయంకోసం చేయని దురాలోచన, అనుసరించని అవినీతి లేదు. ఈ స్వలాభపరులలో ప్రతి ఒకరూ పరిశుద్ధ పద్ధతిద్వారా ప్రజాసేవ చేయడమే మా ఆశయం అంటున్నారు. ఎదుటి నాయకులూ, పార్టీలూ, లంచగొండులు, అవినీతిపరులు, అసమర్థులూ అంటూ హద్దుమీరిన దూషణ ప్రతిదూషణములు సాగిస్తూన్నారు. తమకు చేతనైనంతవరకు ఓటరులను చతురుపాయాలా, కాదు సహస్రోపాయాలతో మభ్యపెట్ట జూస్తున్నారు. అందునిమిత్తం అందుపాటులో ఉన్న ధనం, అధికారం; అక్రమంగా, దారుణంగా వ్యయపరుస్తున్నారు.

శ్రీ మురార్జీ, శ్రీ జగజీవన్ రామ్, శ్రీ చంద్రశేఖర్, శ్రీ అర్సు, శ్రీ బహుగుణ, శ్రీ చవాన్, అనేక రాష్ట్ర ముఖ్యమంత్రులు, మున్నగు నాయకాగ్రేసరులు కూడా అప్రశుతులు లేకుండా వాక్సంయమనం చూపలేకపోవుచున్నారు. నిన్నటి వరకు ఆడిపోసికొన్నవారి పాదాలనే ఆశ్రయించడానికి తలక్రిందులుగా తపస్సుచేస్తున్న నాయకబ్రువుల సంగతి మరీఘోరంగా ఉన్నది. "నేనాశ్రయించినంతవరకూ నాపార్టీ పరమపవిత్రం. నేను విడిచిపెట్టినప్పటినుండీ అంత అపవిత్రమైనది మరొకటి లేదు' ఒకసారి విడిచిపెట్టి నేను మరల చేరేటప్పటికి ఆపార్టీ పరిశుద్ధమై పోయింది." ఇదీ వారి చమత్కార సరళి.

మన రాజ్యాంగానికి సంబంధించి మహోన్నత స్థానమైన దేశాధ్యక్ష పీఠాన్ని కించపరచడానికి కూడా ఆశాభంగ పూరితులైన మహామహులు సంకోచించడం లేదు. లేని అపార్థ కల్పనలతో ఎదుటివారి మంచిమాటలనికూడా నిందించడానికి సాహసిస్తున్నారు. "'కులాలుపోవాలి కులభేదాలుపోవాలి. కులగతంగావచ్చిన మా రిజర్వేషన్లు సృష్టిఉన్నంతవరకూ మాకు ఉండాలి.'' ఈమనస్తత్వాన్ని ఏమనాలో తెలియకుండావుంది. రాజకీయాలంటే ఇవేనేమో. సత్యాసత్యాల విషయం అలాఉంచితే హుందాతనంకోల్పోవని ప్రసంగాలలో శ్రీమతి ఇందిరాగాంధీ మేలుచేయి. ద్వితీయ స్థానం ప్రస్తుత ప్రధానిది. నాయకులందరూ వాక్సంయమనం పాటిస్తే లోకానికి శ్రేయస్కరం కాగలదు. ప్రస్తుత పరిస్థితులలో ఓటరులాలోచించవలసిన విషయాలింకా ఎన్నో ఉన్నవి.

—...—

# 1979-80 బి. వి. అండ్ కో., వారి ప్రచురణములు

## Telugu Five Pandits Notes

### Intermediate

| | | | |
|---|---|---|---|
| I Year | గద్యభాగము నోట్సు | రు. | 6 - 50 |
| ,, | ఉపవాచకము నరమేధము నోట్సు | రు. | 8 - 00 |
| II Year | పద్యభాగము నోట్సు | రు. | 8 - 50 |
| ,, | నాటకము అశ్వత్థామ నోట్సు | రు. | 8 - 00 |

### ENGLISH

| | | | |
|---|---|---|---|
| I Year | English Notes (Prose & Poetry) | రు. | 7 - 50 |
| ,, | Select short stories (Nondetailed) | రు. | 1 - 50 |
| II Year | English Notes (Prose & Poetry) | రు. | 6 - 75 |
| ,, | Tales from Home and Abroad (Nondetailed) | రు. | 1 - 50 |

### డిగ్రీ తరగతులు

| | | |
|---|---|---|
| B. Com. II Year Telugu Notes (Old Poetry with text) | రు. | 7 - 00 |
| B A. II Year Telugu Notes (Old Poetry with text) | రు. | 7 - 00 |
| ప్రతిమ B. Com. II Year నాటకము నోట్సు | రు. | 8 - 50 |
| బలరామ విజయము ,, | రు. | 8 - 50 |
| స్వప్నవాసవదత్తము, సుభద్ర B.A. II Year నాటకము నోట్సు | రు. | 7 - 00 |
| I Year Degree Telugu Notes B. Com. (Prose & Poetry) | రు. | 7 - 00 |
| I Year B. Sc. Poetry Notes | రు. | 4 - 00 |
| ,, Prose Notes | రు. | 4 - 50 |
| ,, B. A., Poetry Notes | రు. | 4 - 00 |
| ,, ,, Prose Notes | రు. | 4 - 50 |

For Copies :—

*Publishers :*

**B. V. & CO.,**

6-8-7, Innispeta, RAJAHMUNDRY-1.

Editor, Printer and Publisher B. Sitharama Sastry, Printed at B. V. & Co., Press, Innispet, (Tyagaraja Nagar) Rajahmundry-1.